GRIHALAKSHMI

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

సంపాదకుఁడు :
డాక్టరు కే. యన్. కేసరి

సంపుటము ౨౦] జూలై 1951 [సంచిక ౭





### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువదైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంథికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# విషయసూచిక










జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# చిరస్మరణీయులు

ఇద్దరు సుప్రసిద్ధ భాషాసేవకులు - శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, డాక్టరు చిలుకూరి నారాయణరావుగారలు యించుమించుగా ఒకేకాలంలో అస్తమించారు. ఇది ఆంధ్రభాషకు తీరనిలోటు. ఆంధ్రులకు తీరని విషాదకరమైనవార్త.

ఇరువురు చిరకాలము ఆంధ్రభాషా పరిశ్రమకును, పరిశోధనకును తమ జీవితముల నంకితము జేసిరి. చాలాకాలము కళాశాలలలో అధ్యాపకులుగా పనిచేసి విధ్యార్థులలో మాతృభాషానురక్తిని ప్రోత్సహించిరి.

డాక్టరు నారాయణరావుగారు భాషా పరిశోధకులుగా నొనర్చినకృషి అమూల్యమైనది. కాల్డ్ వెల్ బయలుదేరతీసిన తెలుగు ద్రావిడభాషా జన్యమను వాదమును ఖండించి డాక్టరుగారు ఆంధ్రము ద్రావిడభాషా జన్యము కాదనియు, దీనికి సంస్కృత ప్రాకృతములే మూలములని సహేతుకముగా నిరూపించిరి. అనేక గ్రంథములు రచించి, కవులుగను, పండితులుగను, విమర్శకులుగను తెలుగునాట ప్రసిద్ధికెక్కిరి. వీరు భాషాంతరీకరించిన వివిధమత గ్రంథములు ఆంధ్రుల కందుబాటులోనికే వచ్చినవి.

పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారి అమూల్యమైన సాహిత్య విమర్శనలు అనేకమంది సుప్రసిద్ధులగు కవులకు మార్గదర్శకములు, సహాయకారులు అయినవి. సంస్కృత, ప్రాకృతములందు శాస్త్రిగారి పాండిత్యము అపారం. కౌటిల్యార్థశాస్త్రము, రాజశేఖర కావ్యమీమాంస, వాత్స్యాయన కామసూత్రములు, గౌతమ ధర్మ సూత్రములు మొదలగు సంస్కృతగ్రంథము లనేకములకు ఆంధ్రమున వివరణలువ్రాసి ఆంధ్రులకు మహోపకార మొనర్చిరి. భారతి మొదలగు సాహిత్యపత్రికలలో వీరి అమూల్య వ్యాసములు యీనాటికి భాషాపరిశోధకులకు మార్గదర్శకములుగా నున్నవి.

తమ జీవితములో చాలభాగము భాషాసేవకై వినియోగించిన వీరి నిర్విరామకృషి ఆంధ్రభాషావేత్తలకు ఆదర్శప్రాయమగుగాక.

---

## ఆడుకూయి



పెండ్లి పీటలమీఁద పెద్దలు చదివించు పొలము ఫలమ్ముకై పోరు నొకఁడు,
పసుపుఁ గుంకుమ గౌరవమ్ముకై తలిదండ్రు బిడ్డ భూమిని విక్రయించు నొకఁడు,
పండుగ పబ్బాల కండు మర్యాదలు దండిగా లేవని మండు నొకఁడు,
అక్క చెల్లెండ్రున కడ్డు లొత్తకయున్నఁ గుత్తుక గట్టిగా నొత్తు నొకఁడు,
కట్ట! కను పట్టదా మగదిట్ట చెట్టు, మూఁడు పూలాఱు కాయలతోడ నుండు,
కూళ చేతల కెన్నాళ్లు తాళవలెనో! ఆలకింపవదేమోయి! ఆఁడుకూయి.

చదలవాడ నాగరత్నము




[కరుణశ్రీ గారి 'ఉదయశ్రీ' చదువుతూవున్నాను. ఎన్నో వింతభావాలు... ఏలోకాల్లోకో తీసుకు పోయినవి నన్ను. కుంతీదేవి కొడుకును గంగకు వప్పచెప్పటం యీ క్రింది ఘట్టం. కుంతి సూర్యభగవానుడి వల్ల కన్నెప్రాయంలోనే కర్ణుణ్ణికంటుంది. అభమూ శుభమూ యెరుగని కన్నెపిల్ల. అడ్డాల్లో పసి బిడ్డను యేమిచేయటానికీ తోచదు. లోకం వేసేప్రశ్నలకు ఆమె యేవిధంగా జవాబు చెప్పగలదు? ఒక్కటే మార్గమున్నది...కన్న బిడ్డను చేతులారా యెక్కడైనా ఒదిలి పెట్టడం. లేకపోతే ఆత్మహత్య చేసుకోవడం...కాని, శతాబ్దాలు దాటిన తర్వాత...ఇవాళ ప్రపంచం కుంతిని గర్హిస్తుంది, మాతృత్వం తెలియని క్రూరురాలని. కాని కుంతిస్థితిలో ఎవరైనా చేయగల పని అదే. కాని అభం శుభం యెరుగని పసి పాపను గంగకు ఒప్పగించి పోవటానికి కుంతి మాతృహృదయం యెంత తిరగబడినదో ఎంత గర్భశోకకు, చిత్రవధకు లోనై ఆ పని చేయగలిగినదో ..మనం ఊహించలేము. కరుణశ్రీగారు 'కుంతీ కుమారిలో' చక్కగా చిత్రించారు]

అందాలు కుప్పలు పోసుకునే పూలతోట. తోటలో ఒక సమున్నత భవనం. మేలిముసుగుతో మేడమెట్లు దిగుతూవున్నది పదిహేనేండ్ల బాలిక. ముఖంలో రాచకళ తాండవిస్తున్నది. కాళ్లు తడబడుతున్నవి. బాలిక భీతి నేత్రాలతో అటూయిటూ చూస్తూ వున్నది.

ఆమె యెవరో కాదు. కుంతి-భోజ మహారాజు కుమార్తె 'కుంతీదేవి.'

ఆమె లేతగులాబి చేతుల్లో ఒక పసి బిడ్డ ఉన్నట్లున్నాడు. రూపురేఖలు అచ్చుగ్రుద్దినట్లున్నవి. కుంతి కొడుకా?

ఆనంద బాష్పాలో, దుఃఖబాష్పాలో తెలియదు కాని ఆమె నేత్రాలనుంచి అశ్రువులు పసిపాప చెక్కుటద్దాలమీద ఏకధారగా రాలుతున్నవి.

తరంగాలు పొంగి పొర్లుతూ గంగానది హోరుపెడుతున్నది. కుంతి పసివాడిని గుండెలకు హత్తుకుంటూ అనుకుంటున్నది—

"ముని మంత్రమ్ము నొసంగనేల? ఇడెబో మున్ముందు మార్తాండు ర
మ్మని నే కోరగనేల? కోరితినిబో అతండు రానేల? వ
చ్చెను బో కన్నియనంచు నెంచక ననున్ జేపట్టగా నేల? ప
ట్టెను బో పట్టి నొసంగనేల? అడుగంటెన్ కుంతి సౌభాగ్యముల్!"

ముని యిచ్చిన మంత్రం కుంతి కన్యాత్వానికే ముప్పు తెచ్చినది!

శోకమూర్తి అయిన కుంతీదేవికి గంగాభవాని శరణమయినది. ఆమెకు అంతకన్న గత్యంతరం తోచలేదు.

" ఈ విషాదాశ్రువులతోడ నింక నెంత
కాలమీ మేను మోతు? గంగాభవాని
కలుషహారిణి — ఈ తల్లి కడుపులోన
కలిసి పోయెద నా కన్న కడుపుతోడ. "

ఆత్మహత్యా, శిశుహత్యా చెరవలేదు కుంతి. లోకం, సంఘం — రకరకాల ప్రశ్నలూ వేస్తూ - ఆమె యెట్టయెదుట అట్టహాసం చేస్తూ నిలువబడినది!

కుంతీ కుమారి నదిలో దిగబోతూనే వున్నది. అంతలోనే — దైవనిర్ణయమే కాబోలు — పెట్టె ఒకటి గంగా తరంగాల్లో తేలుతూ కుంతి పాదాలవద్దకు వచ్చి నిలచినది!

తన ప్రాణమూ, పసివాడి ప్రాణమూ గంగకు పప్పగించటానికి సిద్ధమైన కుంతీదేవికి యిది ఒక ఆశాకిరణం. పెట్టె పొడవూ, తన చిట్టి పట్టి పొడవూ చూచుకున్నది. ఇది భగవన్నిర్ణయమే అనుకున్నది కాబోలు! తనలో అనుకుంటున్నది—

" ఆత్మహత్యయు శిశుహత్య యనక గంగ
పాలుగానున్న యీ దీను రాలిమీద
భువన బంధునకే జాలి పుట్టెనేమొ
పెట్టెనంపించి తెరువు చూపెట్టినాడు "

కుంతి ఒక నిర్ణయానికి వచ్చినది. పెట్టెదగ్గరకు తెచ్చి పసివాడిని పరుండ పెట్టటానికి సంసిద్ధం చేస్తున్నది!

"ఒత్తుగా పూలగుత్తుల నెత్తుపెట్టి —
పై చెరగు చింపి మెత్తగా ప్రక్కపరచి —
క్రొత్త నెత్తళిరాకుల గూర్చి పేర్చి—
ఒత్తుకొనకుండ చేతితో నొత్తి చూచి—"

ఈ పద్యంలో మాతృప్రేమ ప్రస్ఫుటమవుతున్నది. తల్లిప్రాణం బిడ్డ సౌఖ్యంకోసం యెంత తహతహ పడుతుందో కరుణశ్రీగారు చక్కగా చిత్రించారు. కుంతి కన్య, అందులోనూ రాచబిడ్డ, ఎన్నడూ బయటకు వచ్చినది కాదు. అంతఃపురమూ, ఉద్యానవనమూ-ఆమెకు పరిచితమైన స్థలాలు, అయినా మాతృప్రేమ ఆమెచేత యీపని చేయించినది.

చివరకు దడదడ కొట్టుకునే హృదయంతో, ప్రాణాలు బిగపట్టుకుని పసివాణ్ణి అందులో పరుండ పెట్టినది తల్లి!

పరుండ పెట్టినదే కాని, పెట్టెను ప్రవాహంలోకి త్రోయటానికి తల్లికి చేతులెట్లావస్తాయి? ప్రేమయెక్కడకు పోతుంది?

"చెదరు హృదయము రాయి చేసికొని పెట్టె
నలలలో త్రోయ బోవును - వలపు నిలుప
లేక చెయిరాక సుతు కౌగలించి వెక్కి
వెక్కి యేడ్చును - కన్నీరు గ్రుక్కుకొనును -"

పెట్టె నదిలోనికి త్రోయబోతుందట! చేతులురావట! బిడ్డను కౌగలించుకొని వెక్కి వెక్కి యేడుస్తుందట!

ఎంత వాస్తవికంగా వున్నది యీ పద్యభావం? కుంతి దుఃఖిస్తున్నది. అంతటి మహారాజు గర్భాన పుట్టి కన్నబిడ్డను కూడా సాకుకోలేని స్థితివచ్చినది!

"భోగ భాగ్యాలతో తులతూగుచున్న
కుంతి భోజుని గారాబు కూతురునయి
కన్న నలుసుకు ఒక పట్టెడన్న మయిన
పెట్టుకోనోచనైతి పాపిష్ఠిదాన. -" అని విలపిస్తున్నది -

కుంతి కన్య మాతృప్రేమ అంటే యేమిటో, కన్నకడుపు యెంతతీపో యిప్పుడే అర్థం చేసుకుంటున్నది. తనను అంతప్రేమతో చూచే తల్లి దండ్రుల హృదయం యిప్పుడే అర్థమవుతున్నదట ఆమెకు!

అప్పుడు అనుకుంటున్నది:-

'నన్నతి పేర్మిమై గనెడి నాతలిదండ్రుల ప్రేమ యర్థమౌ
చున్నది నేడు బిడ్డ నిట నొంటరిగా విడిపోవ కాళ్లురా
కున్నవి యేమి సేతు కనియున్ గనలేని యభాగ్యురాల నే
నన్నివిధాల కన్నకడుపన్నది కాంతల కింత తీపియే!'

ఆంధ్ర దేశంలో సాధారణోక్తులకు పెట్టినదిపేరు. ఉదాహరణకు యీపద్యం చూడండి.

'పెట్టెయలోన నొత్తిగిల బెట్టి నినున్ నడిగంగలోనికిన్
నెట్టుచునుంటి తండ్రి! యిక నీకును నాకు రుణంబుతీరె; మీ
దెట్టులనున్నదో మనయదృష్టము ఘోరము చేసినాను నా
పుట్టుకమాసిపోను! నినుబోలిన రత్నమునాకు దక్కునే!'

ఇంకోచోట తల్లి కుమారుడి అందాన్ని వర్ణించుకుంటున్నది.

"కన్నతండ్రి నవ్వులపూలు గంపెడేసి -
చిన్నినాన్నకు కన్నులు చేరడేసి -

చక్కనయ్యకు నెరికురుల్ జానజేసి -
చిట్టిబాబు మైనిగ నిగల్ పెట్టజేసి -"

ఈ కవిత్వం హృదయాన్ని ఉయ్యాలలూపుతుంది. చివరకు కుంతీదేవి కుమారుణ్ణి గంగాభవానికి అప్పగింతలు పెడుతున్నది.

'బాల భానుని బోలు నాబాలు నీదు
గర్భమున నుంచుచుంటి గంగా భవాని!
వీని నేతల్లి చేతిలోనైన బెట్టి
మాటమన్నింపుమమ్మ! నమస్సులమ్మ!'

దిక్కులన్నీ చూచినదట కుంతి. భూదేవివంకా, గంగవంకా చూచి వప్పగింతలు పెట్టుకున్నది. ప్రవాహంలోకి త్రోయబోతూ కన్నబిడ్డ ముఖంవంక చూచినది. చివరకు సజల నేత్రాలతో తలయెత్తి సర్వసాక్షీ, తన దీనదశకు కారణభూతుడూ అయిన బాలభాస్కరుని వంక చూచినది!

త్రోయటానికి చేతులు రావు. గత్యంతరములేదు. మాటి మాటికీ చిన్నవాడిని హృదయానికి హత్తుకుంటున్నది.

'ఆతపత్రమ్ము భంగి కంజాతపత్ర
మొందు బంగారు తండ్రిపై నెండదగుల
కుండ సంధించి ఆకులోనుండి ముద్దు
మూతిపై కట్ట కడపటి ముద్దునిచ్చి -'

కంపిత హస్తాలతో పెట్టెను నీటిలోనికి త్రోసి వేసినది. మాతృ ప్రేమబంధాన్ని, లోకం కొరకు త్రెంచివేసికొన్నది.

'ఏటి కెరటాలలో పెట్టె యేగుచుండ
గట్టుపై నిల్చి అట్టె నిర్ఘాంతపోయి
నిశ్చల నిరీహ నీరస నిర్నిమేష
లోచనమ్ములతో కుంతి చూచుచుండె -'

'కుంతి వీరమాత. పంచపాండవులకు తల్లి' రాచకులంలో పుట్టి రాణించిన కుంతి పదిహేనేండ్ల కన్నె ప్రాయంలో అజ్ఞానం చేత యీదుస్థితికి లోనయినది. అయినా ఆమె ధీరురాలు. యమయాతన పడి కొడుకును గంగాతరంగిణికి వప్పగించినది.

కరుణశ్రీగారు యెంత కరుణార్ద్రంగా ఘట్టాలను చిత్రిస్తారో అంత కరుణార్ద్రహృదయులు. వారి దగ్గరే చదువుకున్నాను. 'ఉదయశ్రీ' లో 'కుంతీకుమారి' చదివాక కలిగిన భావాలే నాచేత యిట్లా వ్రాయించినవి.

వేదవతీదేవి

# నిర్వేదన

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మ గారు.

కమలముఁబోలు మోము తెలికల్వలఁగేరెడి కన్నుదోయి బిం
బముఁగని నవ్వుమోవి, విరిబంతుల జీరెడి చన్నుదోయి నీ
లములన నొప్పు కొప్పు మృదులంబగు వాక్కులు లేత నవ్వు గోఁ
మమరెడితల్లి జ్ఞానమనహర్నిశమున్ మదినిల్పివేడెదన్.

అందముగ రసిక హృదయా నందంబుగఁ గవితఁజెప్ప నాకలవియె బా
లేందుధరు కూర్మిసతి నా యందు నిలిచిబలుకుమన్న యంత పలికెదన్.

దుఃఖమయమైన లోకమ్ముఁ దొలఁగిపోవ మిగులఁ జింతించి చింతించి మేరలేని
సంశయాబ్ధిని మున్గుచుఁ జావులేక బ్రదుక లేకిట్లు వెఱ్ఱినై పాడుచుంటి
కాళరాత్రీశ్చయాక్రాంత కఠిన హృదయ వేదనను బాపు వస్తువీ విశ్వమందు
కానుపింపదు ; దేహమా ! కాలిపోవు వ్యసన జనితాగ్ని జిహ్వాకాపటలియందు.

ఎంతటి క్రూరకర్మమొకొ, యెంతటిదోషమొ ; యెంతపాపమో
యెంతయదృష్టహీనతయొ, యెంతటి వక్రపథానువృత్తియో
చింతల వంతలన్ దవిలి జీవితమెల్ల వృథాయొనర్చి యీ
వంతయు తెల్విలేక ఇల వమ్ముగఁజేసితి జన్మమక్కటా.

పాపమే ! యంచు హృదయపూర్వకముగాఁగ సానుభూతిని జూపుచు జాలిగదుర
నీ యనంత ప్రపంచాన నెచటనైన నాకునై చెమ్మగిలు నయనమ్ములేదు.

అడవినిగాచిన వెన్నెల వడువున సున్నంబులేని వలికప్పురపున్
విడియముక్రియ నా జన్మము బుడమిని నిస్సారమౌచుఁ బోయెనుగాదే !

అలలవలె కోర్కెలు మానసాబ్ధియందు నెన్నొ యుప్పొంగి మరియందె యింకిపోయెఁ
గాని సంపూర్ణ చంద్రుని గౌగిలించి సంతతానందమును బొందఁజాలనైతి
గగన సౌధంబు లెన్నియోగట్టికొంటి నల్లిబిల్లిగ కుసుమల తాళిబెనిచి
యందు విహరింపఁగా మదినాసపడితి కూలిపోయెను తుదకవి గాలిలోన.

ఎంతయో ! శ్రమకోర్చి యెన్నినాళ్ళొ యేను కూర్చిన మణులవి యెన్నరావు
మించు రతనాలమేడ నిర్మించుకొంటిఁ గూలిపోయె నయ్యదికూడ గాలిలోన.

ముత్తియపు జాలవల్లరుల్ మొనయునందు స్ఫటికమణిమయ వేదికల్ వరలుచుండు
చలువరాతిన్నె లందందు వెలయు దివ్య రజత గిరిబోలు సౌధరాజంబు నాది.

పాలకడలియట్లు బలుస్వచ్ఛమై యొప్పు మలయగిరి విధాన చలువదనపు
మేరు శిఖరమట్టు మిన్నంటి వెలుగొందు ప్రేమ సౌధమకట భూమిగలసె.

వలపుల తోటలోన ప్రసవమ్ములువిచ్చి నవీన సౌరభ
మ్ములు నలుదిక్కులన్ వెలయు మోదము నొందిమనమ్ము గర్వసం
కులమయి నిక్కుచుండె తనకున్ సరిలేరని, పూలువాడి వ
త్తలుగనశించిపోయిన మదంబుడిగెన్ సిరులేమి నిత్యమే.

కొన్నాళ్ళు గాలివీచును గొన్నాళ్ళును గంధవృష్టి గురియుచు నుండున్
గొన్నాళ్ళు మంచుగురియును నెన్నటికి వసంతకాలమే! యుండదుగా.

ఎక్కడ, యెప్పు డెవ్విధిని, యెవ్వరిచేతను దేనినుండి తా
నక్కట జేర్చియుంచిన శుభాశుభ కర్మఫలంబులన్నియున్
నక్కడ, నప్పుడవ్విధిని యాతని చేతను దానినుండియే
నిక్కముగాఁ విధాత్రుడు గుణించి యొసంగుచునుండు నిత్యమున్.

(సశేషము)

# జట్కా వాడు

హిందీమూలం :
శ్రీ విశ్వంభరనాథ్ శర్మ "కౌశిక్"

అనువాదం :
కొల్లిపర సౌభాగ్యరావు

స్టేషను బయటకు రాగానే నా మిత్రుడు మనోహరలాల్‌తో "గంగాపూర్ వెళ్లాలంటే పదిమైళ్లదూరం. ఒక జట్కా దొరికితే బాగుండును" - అని అన్నాను. మనోహరలాల్ రావయ్యా, జట్కాలకు తక్కువేం, చాలా ఉంటై అన్నాడు.

మేమిద్దరం దాదాపు రెండువందల గజాలదూరం వెళ్లాం. అక్కడొక విశాల వటవృక్షం ఉన్నది. ఆచెట్టునీడన జట్కాలు కన్పించినవి. అప్పుడే జట్కా ఒకటి వచ్చిందక్కడకు. జట్కాలోనుంచి ఒకరిద్దరు వ్యక్తులు తమ సామాన్లు దింపుకుంటున్నారు. మనోహరలాల్ "గంగాపూర్ వచ్చే జట్కా యేదైనా ఉందా?" అని కేకవేశాడు.

జట్కావాడు "రాండి బాబూ, నేతీసుకు పోతాను. ఎంతమంది వస్తారు?"

"ఇద్దరు మనుష్యులే, గంగాపూర్‌కు ఏం తీసుకుంటావు?"

"అందరూ ఇచ్చేబాడుగే తమరూ యివ్వండి బాబూ!"

"అసలెంతో తేలుస్తేగా?"

"రెండురూపాయలు"

"రెండురూపాయలా! - ఇంత అన్యాయమా!"

ఇంతకు ముందే జట్కాలో వచ్చినవారు, జట్కావాడు జగడమాడు కుంటున్నారు. జట్కావాడు "ఇది చాలబాగుంది, బయలుదేరేటప్పుడు రూపాయన్నరకు మాట్లాడుకోవడం, ఇక్కడకు వచ్చిన తర్వాత రూపాయిపావలా యివ్వటమా! మంచి న్యాయమే!" అంటున్నాడు.

ఆ యాత్రీకులలో నొకవ్యక్తి "మొట్టమొదటే . మేము రూపాయిపావలాకు పైన ఒక్క కానీయైనా యివ్వమని చెప్పనే చెప్పాము"

"రూపాయన్నరకు ఒక్కకాసి తక్కువిచ్చినా పుచ్చుకోనని నేనూ చెప్పాను."

"అన్నావేమో, మేమ వినలేదు."

"అవును, వినలేదు - ఈమాట మీరెందుకు వింటారు!"

"నీకిచ్చేది రూపాయిపావలే - తీసుకుంటే తీసుకో, లేదంటావా దారిపట్టు."

జట్కావాడు బలశాలి. నిగ నిగలాడే నేరేడు పండువంటి శరీరఛాయ గలవాడు. పట్టుబట్టాడు - "దారెందుకు పట్టాలి, అన్యాయంగా వుందే! అందరూ ఇట్లాగే దారి పట్టమంటూ వుంటే ఇక సంపాదించినట్లే! పెండ్లాం బిడ్డల్ని బ్రతికించినట్లే! ఎడమ చేత్తో రూపాయన్నర యిటు విసిరేసి మీదారిన మీరు వెళ్లండి! బయలుదేరేటప్పుడు అక్కడ సరే, మీరేటు ఏమిటో అడేయిస్తామని, ఇప్పుడిక్కడ బండి దిగినతర్వాత దారి పట్టమంటున్నారు. భలే మంచివారే దొరికారు!" అన్నాడు.

మేమిద్దరమూ ఈ సంభాషణంతా వింటూ జట్కా మాట్లాడటమే మఱచాము. యాత్రీకులలోని ఒక వ్యక్తి గంభీరంగా - "ఇదిగో, మంచి మాటలతో అడిగితే అణా, బేడా ఎక్కువ యిస్తాం. నోరు మంచిదైతే వూరు మంచిదౌతుందంటారు. జగడం పెట్టుకుంటే ఒక్క కానీకూడా యివ్వం" అని అన్నాడు.

జట్కావాడు చిరునవ్వునవ్వి - "అణా, బేడా - ఓహోహో! తమరు దాన కర్ణులుగా కన్పిస్తున్నారు! అణా, బేడా ఎక్కువ పారేసేవారు నాల్గణాలెందుకివ్వరో!"

"నాల్గణాలు మాదగ్గర లేవు."

"లేవా - సరే, మంచిదే, మీదగ్గర వున్నంతే యిచ్చివేయండి, లేకపోతే యివ్వనక్కర్లేదు. ఒకటి, రెండు రూపాయలు అవసరం ఉంటే చెప్పండి, నేనిస్తాను."

"పాపం నీవేమిస్తావులే? నాల్గణాలకోసం అబద్ధం ఆడుతున్నావు, నమ్మక ద్రోహం చేస్తున్నావు."

"లక్షరూపాయలు వస్తాయనుకుంటేనే నమ్మక ద్రోహం చేయలేదు - నాల్గణాల కోసం నమ్మక ద్రోహం చేస్తానా? అబద్ధం ఆడేవాడినే అయినట్లయితే ఇప్పుడు ఇక్కడ జట్కా తోలుతూ ఉండేవాడినికాదు - సరేబాబూ, మీరిచ్చేదేదో ఇవ్వండి - లేదా వెళ్లండి బాబూ - బండిబాడుగ వచ్చిందనుకుంటాను. ఎందుకు ఘర్షణ?"

యాత్రీకులు రూపాయిపావలా తీసియిచ్చారు. జట్కావాడు మారుమాట చెప్పకుండా డబ్బులు తీసుకున్నాడు.

ఆ జట్కావాని ఆకారవైఖరి, అతని సంభాషణా విధానం, ఇతర జట్కా వాళ్లవంటివాడు కాదని అనిపించింది. ఇతనిలో విశేషమేమైనా తప్పక యుండి యుండాలని

మనస్సులో అనుకొని, వీలయితే గంగాపుర్ ఇతని జట్కాలో వెళ్లాలని నిశ్చయించుకున్నాను. ఈ విధంగా నిశ్చయించుకొని నేనా జట్కావాణ్ణి పిలిచి - "ఏమయ్యా, గంగాపుర్ వస్తావా?" అని అడిగాను.

జట్కావాడు — "వస్తాను బాబూ దయచేయండి."

"ఏం తీసుకుంటావు బాడుగ?"

"ఆఁ, రూపాయన్నరే!"

ఇతర జట్కావాళ్లను అడిగితే రెండురూపాయలు అడుగుతున్నారు; ఇతను నిఖార్సైనవాడుగా కనబడుతున్నాడు అని ఆలోచించి నేను - "సరే, రూపాయన్నర యిస్తాము" అని అన్నాను.

మేమిద్దరమూ జట్కా ఎక్కాం. బండి బయలుదేరింది. కొంతదూరం పోయిన తర్వాత "వాళ్లిద్దరూ ఎవరు?" అని నేనడిగాను. జట్కావాడు - ఆ భగవంతునకే తెలియాలి, వారెవరో. పరదేశస్థులుగా తోస్తున్నారు; కాని పచ్చిమోసగాళ్లు. నాల్గణాలకోసం ప్రాణాలు పోయినై వాళ్లకు" అన్నాడు.

నేను - "వాళ్లు నిజంగా నీతో రూపాయన్నర బాడుగ మాట్లాడుకున్నారా?" అన్నాను.

"లేకపోతే తమరూ అబద్ధమనుకుంటున్నారా? అయ్యా, ఈ వృత్తే అటువంటిది. మీరు అలా అన్నారూ అంటే మీదోషం ఏముంది. జట్కావాళ్లు, బళ్లవాళ్లు ఎప్పుడూ అసత్యాలాడేవాళ్లని, మోసగాండ్రని అనుకుంటూ ఉంటుందిలోకం. ఈబళ్లవాళ్ల జాతిలోను, లోకం అనుకుంటున్నస్లెక్కువగా అసత్యం, మోసం ఉంది. వీళ్లకు మీరు రూపాయకు, రూపాయిపావలా యివ్వండి, సంతోషమే ఉండదు వీళ్లకు."

నేను "మీరెవరు?"

"నేనేనా? వైశ్యుణ్ణి."

"భలే! వైశ్యుడవై జట్కాతోలుతున్నావా?"

"ఏం బాబూ, జట్కాతోలటం చెడుపనేమీకాదే?"

"కాదు, కాదు, జట్కాతోలటం చెడుపని అనికాదు నాఉద్దేశ్యం. వైశ్యులు తరుచు వ్యాపారం చేస్తూ ఉంటారు?"

"ఇదీ వ్యాపారమే."

"అవును, ఇదీ వ్యాపారమే."

ఈ అసంగతమైన ప్రశ్నకు నేనూ లోలోపల సిగ్గుపడ్డాను. ధోరణిమార్చాలని "ఎన్నాళ్లుగా ఈపని చేస్తున్నావు ?" అని అడిగాను.

"రెండేళ్లు గడిచినై బాబూ."

"రెండేళ్లకు పూర్వం ఏం చేసేవాడివి ?"

నాప్రశ్నవిని జట్కావాడు - "ఏంచేస్తూ వుండేవాడినో ఏమని చెప్పను" అని గంభీరంగా చెప్పాడు.

ఇతను చెప్పే సమాధానం, ఇతను ఆయాత్రీకులతో సంభాషించిన తీరు పోల్చి చూస్తే ఇతడు సామాన్యమైన జట్కావాడు కాదనీ, ఈ వ్యక్తి జీవితంలో ఏదో రహస్యం దాగివున్నదనీ అనుకున్నాను. నేనతన్ని - "నీకేమీ అభ్యంతరమూ, సంకోచమూ లేకపోతే నీయావద్వృత్తాంతంచెప్పు, మాకూ విందామని కుతూహలంగా వుంది. ఈ పదిమైళ్లూ వెళ్లేలోగా పిచ్చాపాటీగా కాలం గడిచిపోతుంది" అని అడిగాను.

"సంకోచమూలేదు, అభ్యంతరమూ లేదు బాబూ! నామాటలు లోకులు నమ్మరు అసత్యమని, కల్పితవృత్తాంతమని అనుకుంటారు. ఆదిన్నీకాక జట్కావాళ్లను లోకం గప్పాలుకొట్టేజాతి అని భావిస్తుంది. ఇందుకనే నేనెవరికీ నాస్థితిగతులను చెప్పను."

"నేను నువ్వు వర్ణించిన వాళ్లల్లో వాడినికాను. నామాటనమ్ము."

"బలవంత పెడుతున్నారు. మిమ్మల్ని నిరుత్సాహపరచడం బాగాలేదు. సరే, చెబుతున్నా వినండి బాబూ"

'నేను అగ్రవాలా కోమటిని. నాపేరు శ్యామలాలు. మైనపురి నాజన్మస్థలం. నాతండ్రి వ్యాపారం చేస్తూ ఉండేవాడు. ఆయన పరలోకప్రాప్తి నొందేటప్పటికి నాకు పదునైదేళ్ల వయస్సు. తండ్రిగారు మరణించినపిమ్మట కుటుంబ సంరక్షణభారం నామీద పడింది. నేనొక సంవత్సరం వ్యాపారంచేశాను; నాకు వ్యాపారానుభవం తక్కువ. ఇందువల్ల వ్యాపారంలో నష్టంవచ్చింది. అది తారుమారైంది. కుటుంబాన్ని పోషించడం కష్టతరమైంది. ఏ ఉపాయమూ తోచలేదు. చివరకొక షావుకారుదగ్గర నౌకరుగా కుదిరాను. నాకుటుంబంలో నాతల్లి, నాచెల్లెలు ఉన్నారు. నేనునౌకరీ చేస్తూవున్న షావుకారు ధనవంతుడే, అయినా చాలలోభి. ఇంతధనం గలవాడైనప్పటికీ సామాన్య మనిషిగా కన్పడుతూఉంటాడు; లోకులందరూ ఇతనిదగ్గర దాదాపొక లక్షరూపాయల రొఖ్ఖంవుంటుందని అనుకుంటూ వుంటారు. నేనా లోకులమాటలు, వదంతులు నమ్మలేదు; అతని ఇంటి పరిస్థితులనన్నింటినీ చూస్తూఉంటే ప్రజలు చెప్పుకుంటూ ఉన్నంత ధనం

ఉండదని భావిస్తూ ఉండేవాడిని. ఆయనవయస్సు నలభై దాటుతుంది. రెండో పెళ్లిచేసుకున్నాడు. భార్య ఇరవైయేళ్ల నవయువతి. రూపసి. ప్రథమభార్యకొక కుమారుడున్నాడు. అతడా యువకుడు. ఆతనిపేరు శివచరణలాల్. మొట్టమొదట అతడు తండ్రితో కలిసి ఉండేవాడు, కాని ద్వితీయ వివాహం చేసుకోగానే తండ్రిపై కోపించి తనభార్యను తీసుకొని ఫర్రుఖాబాదు వెళ్లిపోయాడు. అక్కడే ఒకదుకాణం పెట్టుకొని ఉంటూ ఉన్నాడు.

అప్పట్లో నేను వ్యాయామం చేసేవాడిని. వ్యాయామం చేయటం అంటే నాకు చాల ఉత్సాహం. శరీర సౌష్టవం, ఆకర్షనీయంగావుంది. కొంతకాలం గడిచింది. యజమానురాలు నన్నెక్కువగా గౌరవించటం సాగించింది. ఫలహారాలు పెడుతూ ఉండేది. నెలకు పదీ పదిహేను రూపాయలు రొఖ్ఖంకూడా యిస్తూ ఉండేది. ఈవిధంగా కుటుంబ కాలేక్షేపం సుఖంగా గడిచిపోతూఉంది. ఆమె చూపుచున్న ఆదరణలో ఉన్న ఉద్దేశ్యాన్ని గ్రహించలేకపోయాను. నాసేవలకు ప్రసన్నురాలై యజమానురాలు నన్ను బాగా గౌరవిస్తూ ఉంది; ఆమె చాల దయగలది; ఉదారవంతురాలు అని నామనస్సులో ఆమెయందు పూజ్యభావం ఏర్పడింది. ఒకరోజున ఆమెనన్ను వంటరిగా పిలిచి బలవంత పెట్టసాగింది. అప్పుడామె మనోమాలిన్యం నాకవగతమై పోయింది. ఆమె ఆదరణకు, దయకు గల అభిప్రాయం ఒక్కసారి కన్నులముందు సినిమాచిత్రం వలే కన్పించింది. నాకు మొట్టమొదటనుంచీ ఇటువంటి పనులంటే అసహ్యమూ, చీకాకున్నూ. ఈపనుల నేనెప్పుడూ చేయలేదు. ఈపనులు నాకు తెలియవనే చెప్పాలి. ఈవిషయాలన్నీ అవగతమయ్యే దుస్సాంగత్యం నేను చేయనేలేదు. ఆవయస్సులో మానవుడనేవాడు చక్కగా, సుందరంగా ఉండాలనీ, స్త్రీవ్యామోహం ఉండకూడదనీ నేనెరుగుదును. యజమానురాలు నన్నుకోరి, బలవంతం చేసినప్పుడు ఆమెపై అనురాగం కలుగుటకు బదులు భయంకల్గింది. నాగుండెకొట్టుకుంది. అప్పుడామె ఒకరాక్షసనీ, నన్నుభక్షించనున్నదనే భయం తోచింది.

జట్కావాడు చెప్పిన చివరిమాటకు నామిత్రుడు మనోహరలాల్ పక్కున నవ్వాడు. తడుముకోకుండా "నువ్వు చాల తెలివి తక్కువాడవు, అమాయకుడవు" అని అనేశాడు.

శ్యామలాలు "మీరిప్పుడు ఎలాఅన్నప్పటికీ జరిగిందేమో అది. సరే, నాచెయ్యి విదిలించుకొని ఆమెను తప్పించుకొని పారిపోయాను. ఇక ఆమె ఎదుటకు వెళ్లాలంటే భీతి కల్గేది. నామనస్సులో, మళ్లీ యెప్పుడయినా నన్ను బలవంత పెట్టుతుందేమో నన్న

డక్కు ఏర్పడింది. రెండు మూడు రోజులు గడిచిన తర్వాత నేననుకున్నట్లే జరిగింది. అవకాశం చూచుకొని నన్ను మళ్లీ బలవంతం చేసింది. ఆరోజున నేనామెతో ఇక ముందిట్లా బలవంతం చేస్తే యజమానితో చెప్తానని స్పష్టంగా చెప్పివేశాను. అప్పటి నుంచి ఆమె నన్నిక ఆదరించటం మానివేసింది. ఆదరించక పోవటంతో సరిపోయిందా, లేనిపోనివి కల్పించుకొని సాధించడం ప్రారంభించింది. మాట మాటకు కోపపడుతూ ఉంది. ఏదో ఒక నెపం పెట్టుకొని యజమానితో ఫిర్యాదు చేస్తూ ఉంది. ఆమె ప్రోత్సాహంవల్ల యజమాని ఒకరోజున నన్ను చీవాట్లువేశాడు, తూలనాడాడు. యజమానిని చాటుకు తీసుకుపోయి "అయ్యా, నా లెక్క చూచి నాకు రావలసిన జీతం నాకిచ్చి వేయండి. ఇక మీ దగ్గర నౌకరీ చేయదలచుకోలేను." అన్నాను. యజమాని కన్ను లెఱ్ఱచేసి ఉగ్రుడై "తప్పుచేయడమూ - పైగా జీతం యిచ్చి వేయమంటున్నావా?" అన్నాడు. నాకూ పట్లుమండిపోయింది. "తప్పుచేసిందెవరు?" అని నేనన్నాను. యజమాని - "అమ్మగారబద్ధం చెబుతున్నారా" అని ప్రశ్నించాడు. నేను "అక్షరాలా అబద్ధం" అని నిర్భయంగా జవాబు చెప్పాను.

"ఆమెకు నీమీద విరోధమా?"

"అవును, విరోధమే"

"ఎందుకని, నీవేమైనా అపకారం చేశావా."

"తమకా సంగతి ఏమని విన్నవించను. తమరు ఆమాటను అసత్యమని భావిస్తారు. కనుక నా లెక్క చూచి నా జీతం నాకిచ్చివేయడం చాల ఉచితం, న్యాయమూనూ."

(సశేషము)

# ముందడుగు

తెనుగు వారలమాట - తీయని బాటగాఁ గదలింపగల యట్టి - కార్యదీక్ష,
పరిసంధి వీరులబలము శాంతిలఁజేసి మరలింపగలమన - మతము సూక్తి

వీరాంగనలగన్న - భారతాంబకునాత్మ నంకిత మొనరించు - నమితభక్తి
ఆంధ్రకేసరి బుల్సు - లలఘు రాధాకృష్ణు లమితధీయుత మహితాత్మశక్తి

నమ్మనమ్మయెనీ తెనుగమ్మ కిపుడు ఆంధ్రరాష్ట్ర ప్రసిద్ధి వెన్కంజవేసె
ప్రతిభగాంచిన పట్టాభి ప్రముఖులుండ కదలుడో ఆంధ్రవీరాగ్ర - గణ్యులార

కరుడుగట్టిన యాంధ్ర రక్తమ్ము నేఁడె కరగి ప్రవహింప రాదొకో కార్యదీక్ష
కడగి మన యాంధ్రభూమి త్రొక్కంగవలదె ఆంధ్ర వీరుల ధీశక్తి యంతమయెనె!

ఎపుడో రాఁగల రాష్ట్రమిందనుక రానేరాక పోయెన్ గదా
విపులాంధ్రావనిలో ప్రజాళికల - తావేలేక కివంగ న
స్సఫలంబేట సమైక్య భారత ప్రజాసఖ్యంబె లక్ష్యంబుగా
జపమాలల్ మెలివేతురో ప్రముఖులాశాజ్యోతి వెల్గింతురో!

ఉమ్మడి గొడ్డుచావునకు ఊరటగొల్పెడు వారులేరు వా
క్కుమ్మడి రాష్ట్రరాష్ట్రమని గోలగలంగ నొనర్చి యిప్పుడ
మ్మమ్మలునైరి తిమ్మరుసు మంత్రులగన్న తెనుంగుతల్లి గ
ర్భమ్మున బుట్టుటేల పెరవారికి వందనమంటకే కదా?

జీవములేని ప్రాణువడి - చేవదొఱంగి యడంగి యుండుటల్
మావిధి కాదు కాదనుచు మ్రగ్గుట నీచము తీవ్రయత్నముల్
గావలె నాంధ్రలక్ష్మి కడగండ్ల మునింగెను లేవనెత్తగా
బోవలె రాష్ట్రముండుటకు ముందడుగేయుడి శీఘ్రమిత్తరిన్.

గిడుగు లక్ష్మీకాంతమ్మ

# వీణ



వీణా, ప్రణవనాదం, బల్కుమా
సప్తతంత్రులు, సాగిలపడి, ప్రణామంబిడ ॥ వీణా ॥

యౌవ్వన పవనుని, రాకత్తై నీ, వెదురుజూచెద, వేలనే ?
హృదయవీణలు, ప్రతిధ్వనింపగ, ఊపవేవీణా, ఆపకేవీణా ॥

దశేంద్రియముల, తాకిడికి నీ, వేమిబల్కెద, నెవరికెరుక
అదియెశాస్త్రం, బదియెధర్మమటంచుబల్కెద, వెందుకే ? ॥

తుమ్మెద శృతులు - తాళగతులు
కోయిలగానము - కమ్మని గీతము
తేనెలధారలు - తీయగ కురియగ
వసంతవనమున - మేల్కొనుమా వీణా ॥

బి. యస్. రాజారెడ్డి




కె. సభా

(గతసంచిక తరువాయి)

కొన్ని వెంట్రుకల కుచ్చును ఈ జడతో కలిపి అల్లడం అలవాటైంది. వీటినే సవరనులంటారు. ఈ సవరనులకు తిరుపతి పెట్టినది పేరు. ఈ వెంట్రుకల ధరలు గూడా రూపాయ నుండి పాతిక రూపాయలవరకూ వుంటాయి.

జడపొడుగునా పూలు కుట్టుకోవడం కొందరి కలవాటు. దాదాపు పల్లెల్లో చాల మంది పెళ్లికూతుళ్ల జడలలాగే వుంటాయి. కొందరు జడ మొదట పూలు పెట్టడం కద్దు. ఇదిచాలమంది అలవాటు. ఇప్పుడిప్పుడూ మొదలు విడిచి కొసల్లో పెట్టడం గూడా కనబడుతున్నది.

ఈ జడను వేశాక చుట్టగా చుట్టుకోవడం గూడా జుట్టు తీరుల్లో ఒకరకం. బహుశా దీనినే కీల్జెడ అంటారు కావాలి.

“సొగసు కీల్జెడ దాన
సోగ కన్నుల దాన
ఒగలేల సినదానా
ఒకసారి ఒచ్చిపో పిల్లదానా”

అంటూ కోలాటములోని ఝూడవ కోపులో శివమెత్తి నృత్యం చేస్తారు పల్లెయువకులు. వాయల్పాడు తాలూకాలోని ఉదయమాణిక్యం అడవుల్లో నడచి పోతుండే సంధ్యారాగంలో పశుల కాపరి పాడుకుంటున్నాడు.

“నీవు లేకుంటేను
నిద్దరే పట్టదు
నీలిమబ్బులకళ్ల
పిలదాన
.........
.........
నాగులే నీజడలు
నల్లదాన!”

సింగారాలను చిలకరిస్తూ, ప్రణయాలను తొలకరిస్తూ, వలపువాగుల ఒలక బోస్తూ నడచిన ఈ కవితనేమనాలి !

ఆ నీలి మబ్బుల నీలాలు, రుచులీనేకళ్లు, ఇక.... మిగిలిన అవయవాల పొందిక... పీటికితోడు యౌవనంపొంగి నల్లత్రాచులాగా బుసలు కొడుతున్నదని సూచించే ఆ జడ.

చరిత్ర కందని, సారస్వతానికి చిక్కని, ఈ పదాల సంపదను సంపుటీకరించు కుండే శ్రమలో తొలకరించిన శృంగార సాహిత్యం తెలుగు సాహిత్యవనాన్ని పులక రింపు జేస్తుంది.

"కృష్ణమ్మ జడనిండా
కోటిపూలు
సీతమ్మ జడలోని
సేమంతిపూలు
మాయింటి పందిట్లో
మల్లెపూలు
మీయింటి కోడాలు
మొగిలిపూలు"

ఈ లాంటి గీతికల్లో సహిత్యం జడల నాణ్యాలు, ముడుచుకునే పూల గురించి చెప్పబడింది.

ఇప్పుడిపుడూ కనబడే పల్లెసారస్వతంలో ఇలాంటి గేయాలు అరుదై పోయినై. వాటి స్థానంలో సినిమా పాటలు వ్యాపిస్తున్నాయి.

జడ చివర ముడిలేక ఒదిలేరకం ఒకటైతే, జడ మొదటిభాగం అల్లక దాదాపు సగంవరకుగూడా ఒదిలేరకం ఒకటి. ఈ జడమీదే చిన్నదై బహుసన్నంగా అల్లబడ్డ జడనుగూడా కలపడం ఒకరకం. కొందరు జడలోని మధ్యభాగంలో రిబ్బన్ పెట్టడం గూడా కద్దు. ఈ రిబ్బన్ స్థానం యిదమిద్ధమని చెప్పడం కష్టమనే చెప్పాలి. కనుకనే ఎవరో ఒక ప్రియుడు తన ప్రేయసికి ఉత్తరం వ్రాస్తూ నీ జడ రిబ్బన్ ముక్కను పంపు. దానిని దాచుకుంటానని వ్రాశాడట పాపం!

ఒక్క జడతో తనివి తీరకనో, లేక అందం రెట్టింపు అవుతుందనో ఆలోచించిన విదుషీమణులు కొందరు రెండు జడలు ప్రారంభించారు. ఈ విధానాన్ని మొదట కని పెట్టిందెవరో చెప్పలేముగానీ ఇటీవలకు ముందు తల ఒక్కటైనా జడలు రెండుగా బహు చోట్ల కనిపించేవి. ఇప్పు డిప్పుడూ ఈ కనబడడం చాల మట్టుకు తగ్గిందనే చెప్పాలి.

ఒక్క జడ ముందువైపున మరోజడ వెనుక వైపున వ్రేలాడుతుంటే నిజానికి చూడ్డానికిగూడా యింపుగానే వుంటుంది. అలంకరించుకోవడంలోని ఈ విధానాన్ని ఎవరూ కాదనలేరు.

మళ్లీ ఈ రెండు జడల తీరులు అభిముఖాలుగా సాగాయి. ఒక జడకు పూలుంటే ఒక జడకు రిబ్బన్. యీలాగా మార్పులు గల్గుతూ వచ్చాయి. ఒక జడనుచుట్టి ముడతబెట్టి మరోజడను వ్రేలాడతీయడం ఒక విధానం.

ఇటీవల ఒకజడను మాత్రం అల్లి మరో ప్రక్క ఒట్టి జుత్తునే ముడిపెట్టడంగూడా ఆచరణలో కనబడుతుంది. కానీ ఇది చాలా అరుదు.

తరతరాలనుండి నేటివరకూ అభివృద్ధి పొందుతూవచ్చిన తలకట్టు తీరుల చరిత్రలో కొండెజడ విధానం బహూపసందైంది. ఈ కొండెజడనుఅల్లి ముడివేయడంలో కొంత ప్రయాసకల్గినా ఆ ముడిమీద చంద్రవంకలాగా పూలు ముడుచుకుంటే అందం తొణికిసలాడుతుంది. ఈ జడల తీరుల్లో ఒక్కొక్కరు నాలుగు ఐదు జడలు వేసుకోవడం జగిరినా అది అంత అందాన్నివ్వడంలేదని గ్రహించి మళ్లీ రెండు జడలే నయమనుకున్నట్లు తోస్తున్నది.

జడలమోజు కొద్దిగా తగ్గుతున్నది. ఆ స్థానాన్ని ముంగురులు ఆక్రమిస్తున్నాయి. జడలన్నీ వెనుకటి చరిత్రకు వెనుకటి భాగానికి సంబంధించింది గనుక ముందరి వెంట్రుకలను సవరించడంలో ప్రత్యేకశ్రద్ధ వహిస్తున్నది యువతీ జగత్తు. సుడులు దిరిగిన ముంగురులు ముఖానికి ఎక్కువ అందాన్నిస్తాయి గనుకనే ముంగురుల వంకరలను తీర్చి దిద్దడం ఆచరణలోకి వచ్చింది.

ఈ ముంగురుల సౌందర్యోపాసన ముందు కాలాల్లోగూడా లేకపోలేదు.

"పుంగనూరు సంతలో
పిలదాన
పూలమ్మ నొస్తివా
సినదాన
సేమంతి పూవుల
సినదాన
సెదిరింది నీకొప్పు
పూలదాన"

పూలపిల్ల సౌందర్యాన్ని తిలకించిన రసికునికి ఆమె చెదరిన ముంగురుల విన్నాణం కనిపించింది. అందాన్ని గురించి ఆలోచించుకున్నపుడు ముఖలావణ్యంలో ముంగురులు ప్రథమ స్థానాన్ని అలంకరిస్తాయి.

ఆడపడుచుల సింగారాలకు తలకట్టు అగ్రతాంబూలాన్ని అందుకుంటే ఆ తల కట్టుకు ముఖసీమలోని ముంగురులు మేలిమెరుగుల్ని దిద్దుతాయి.

ఇక ఆ వెంట్రుకల్ని చెదరకుండా రక్షించడానికి ఒకవల అవసరమైంది. ఈ తెఱను ఏకొద్దిమందో వాడుతుంటారు.

జుత్తు తీరుల్లో ఇప్పటి చివరిదశ క్రాపులని చెప్పవచ్చు. ఈ క్రాఫింగు ఏ ఒక్క-రిద్దరికోతప్ప మిగిలినవారికి అందాన్నివ్వదు. పైగా అటు స్త్రీ జాతికి చెందక యిటు పురుషజాతికి చెందక మరో క్రొత్తరకంగా కనిపిస్తుంది. చీరె కట్టుకు జడలు అందమిచ్చినట్టు క్రాఫింగ్ అందమివ్వదు. ఈ విధానం అసలు సౌందర్యాన్నే చెడగొడుతుంది. ఇది గౌనులు ధరించే పాశ్చాత్యవనితా లలామల తీరులకు సరిపోతుందిగానీ భారత మహిళకు సరిపడదు.

అలంకరణల్లో ఎన్ని కొత్త హంగులు ప్రవేశించినా అందుకు కావలసిన వస్తు సామగ్రి చౌకగాను మరీ అందాన్నిచ్చేవిగానూ వుండేలా చూచుకోవడం చాలా అవసరం.

నేటి అలంకారాలకు అంకురార్పణలు చిత్రజగత్తులో జరుగుతున్నవి గనుక, సినిమా తారల తీరులే ఈ నాటి విదుషీమణులలో చాలమంది సౌందర్యారాధనలో ఆదర్శనీయాలౌతున్నాయి గనుక ఆ ప్రవేశపెట్టే విధానాలను కాస్త సరసమైనవిగా, అందమైనవిగా చూడడం వారి కర్తవ్యం.

——(:o:)——

# పాఠశాలా ప్రవేశానికి పూర్వం, సోవియట్ రష్యాలో విద్య

పసిపిల్లల ఆరోగ్యరక్షణకూ, దేశమంతటా వారికోరకు సంస్థలు, భవనాలకోరకూ, ప్రతిసంవత్సరమూ జాతీయార్థిక ప్రణాళికలు, బడ్జెట్‌లనుంచి, మిలియన్లకొలది రూబుళ్లు కేటాయించ బడుతున్నాయి.

1915 - 16 లో జారిస్టురష్యాలో వుండే సుమారు 300 ల శిశుపోషణాలయాలలోనూ, 7000 దాకా పిల్లలుండేవారు. వాటిలో అత్యధికభాగం ప్రత్యేక వ్యక్తులకొరకుగాని, హితకారిణీ సంఘాలచేత కాని నడుపబడుతూండేవి.

సోవియట్ రష్యాలోని శిశుపోషణాలయాలు 1950 లో 26000 కు మించియున్నాయి. మూడు, ఏడు, సంవత్సరాలమధ్య వయస్సుగల పిల్లలు 10 లక్షలుపైగా, వాటికి హాజరవుతున్నారు.

శిశుపోషణాలయాలలోని పిల్లలను వయోభేదాన్నిబట్టి, వేరువేరు శాఖలుగా విభజిస్తారు. ఒకొక్క దానిలో 25 మంది పిల్లలున్న ఈ శాఖలు, ఒకటి మొదలు అయిదువరకూ వుంటాయి యీ శిశుపోషణాలయాలలో.

సంవత్సరంపొడుగునా పనిచేసే శిశుపోషణాలయాలే కాకుండా, వేసవిలో పిల్లల ఆటస్థలాలలో పనిచేసేవికూడా వేలకొలదీవున్నాయి. పట్టణాలు, పారిశ్రామిక ప్రదేశాలు, సమిష్టి వ్యవసాయక్షేత్రాలలోని, పాఠశాలకువెళ్లే వయస్సులేని పిల్లలకు 10 లక్షలమందిదాకా, యివి వసతులు కల్పిస్తున్నాయి.

శిశుపోషణాలయాల నిర్మాణము, పనిచేసేవిధానం, విద్యాశాఖ ప్రచురించిన "శిశుపోషణాలయ వుపాధ్యాయునికి సూచనలు" అన్నకరపత్రంలో వివరించినట్లుగా, క్రమబద్ధమైన, ఆచరణ యోగ్యమైన సూచనలపై ఆధారపడివుంటాయి. శిశుపోషణాలయాలు తెరువబడు కాలం, పని చేసేగంటలు, కూడా, వుద్యోగంచేసే తల్లుల వీలుపై ఆధారపడివుంటాయి. ఇవన్నీకూడ రోజుకు 9, 10 గంటల చొప్పున వారంలో ఆరు రోజులు పనిచేస్తాయి.

వేసవిలో, శిశుపోషణాలయాలు, పట్టణంవెలుపల చల్లని అందమైన వుపవన ప్రాంతాలకుగాని, సముద్ర ప్రాంతాలకుగాని, మారుతూంటాయి.

పిల్లల సర్వతోముఖాభివృద్ధికి, శిశుపోషణాలయాలు పాటుపడతాయి. పిల్లల ఆరోగ్యాన్ని కాపాడి, సరియైన ఆరోగ్యశిక్షణ వారికి కలుగచెయ్యడం, వీటి ముఖ్యాశయాలలో ఒకటి. అందుచేత పిల్లల సరియైన, దారుఢ్యమైన, శారీరాభివృద్ధికి అవసరమయ్యే పరిస్థితులు కల్పించడానికి, సమర్థమైన వుపాధ్యాయవర్గం తనశక్తిని కేంద్రీకరిస్తుంది.

శిశుపోషణాలయ భవనాల్ని, తోటల్ని నిర్మించేటప్పుడు, పై ఆశయాల్ని దృష్టిలో నుంచుకుంటారు. భవననిర్మాణం; దేశంలోని ప్రముఖవాస్తుశాస్త్రజ్ఞులు కొనసాగిస్తారు. సోవియట్ విద్యాబోధన, ఆరోగ్య, స్థాయిలకు అనుగుణంగా వుండేలాగ.

## పా. ప్ర. పూ. సో. రష్యాలో విద్య

పిల్లలు రోజుకు 5, 6 గంటలు, బయట పరిశుభ్రమైన గాలిలో గడుపుతారు. వేసవికాలం అయితే, రోజల్లా అన్ని కార్యక్రమాలూ ఆరుబయటనే జరుగుతాయి. ఈ కారణంచేత, ప్రతి శిశుపోషణాలయానికీ పూలమొక్కలు, దుబ్బులు, చెట్లు, నాటబడిన విశాలమయినతోటలు, భవనాలకి చుట్టూ వుంటాయి.

ప్రత్యేక వయస్సుగల పిల్లలకు నేర్పవలసిన సంగతులు, విధానాలు, మొదలయిన వాటిని గురించి నిర్ణయించబడిన సూచనలకు అనుగుణంగా, పిల్లలకు ఆటలు, పాటలు, నడత, మొదలైనవి నేర్పబడుతున్నాయి.

ఒక సమిష్టి సంస్థలో సహకరించే సభ్యులుగా నడుచుకోనేటట్లు పిల్లలకు శిక్షణ యివ్వబడుతూంది. సరియైన అలవాట్లు; మంచినడత; పెద్దలఎడల, యితరులఎడల, మర్యాదగా ప్రవర్తించడం, వారు నేర్చుకుంటారు. పనినీ, పనివారినీ, పెద్దలనీ, మాతృదేశాన్నీ, గౌరవించి ప్రేమించడం వారికి నేర్పుతారు అక్కడ.

మాటలు, ప్రదేశాలను చూపించడం, పుస్తకాలనుండి వారికోసం చదివి వినిపించడం, యివినిత్య కృత్యాలు. వీటిద్వారా, వారిచుట్టూవుండే జీవితాన్నీ, వారు అర్థంచేసుకోగల సామాజిక సత్యాలనీ, వారిదేశ సంపదలనీ, వారి స్వగ్రామాల సౌందర్యాన్నీ, ఆ చిన్నపిల్లలకు అందుబాటులోకి తెస్తారు. శిశుపోషణాలయావరణలలో, కూరగాయలమడులు, పూలమొక్కలూ, పండ్లపొదలూ, పెంచుతారు. వీటినుంచి ప్రకృతి విషయాల ననేకంగా నేర్చుకుంటారు పిల్లలు.

ప్రతిరోజూ నేర్పబడే సంగీతం, చిత్రలేఖనం, మొదలైనవి పిల్లలకు కళాభిరుచి, వూహాశక్తి, పరిశోధనా సామర్థ్యం కల్గించి, పనిచేసే అలవాటును అబ్బుతాయి. పిల్లల సంభాషణలు, పదజాలము, జ్ఞాపకశక్తి, వీటి అభివృద్ధికొరకై ప్రత్యేకశ్రద్ధ తీసికోబడుతూంది. వయస్సుపెరుగుతూన్నకొలదీ వారికినేర్పే పాఠాలుకూడా క్లిష్టతరమవుతూంటాయి. పాఠశాలకుపోయేప్రాయం వచ్చేసరికి, సువిద్యాభ్యాసానికి వారికి కావలసిన మానసిక, శారీరక పరికరాలన్నీ యీవిధంగా సమకూర్చబడుతాయి.

పాఠశాల పూర్వ వుపాధ్యాయ శిక్షణాలయాలూ, అధ్యాపక శిక్షణా సంస్థలలోని పాఠశాలా ప్రవేశ పూర్వ శాఖలూ ప్రతిసంవత్సరం వేలకొలది అధ్యాపకులను తర్ఫీదు చేస్తున్నాయి.

శిశుపోషణాలయోపాధ్యాయులు తమ శిక్షణ నభివృద్ధిపరచుకొనటానికి సకలావకాశాలూ వున్నాయి. బోధనా పద్ధతులు; యితర సలహాలు యిచ్చేపాఠశాల పూర్వ విద్యాశాఖలు అన్ని పట్టణాలలోనూ వున్నాయి.

చిన్నవయస్సుగల పిల్లల పెంపకంలో వుపాధ్యాయులకూ, తల్లిదండ్రులకూ సహాయపడేందుకుగాను, విద్యాబోధనా పుస్తకాలు, పిల్లల పుస్తకాలు, లక్షలకొలదిగా ప్రతి సంవత్సరం ప్రచురింపబడుతున్నాయి. రష్యన్ రిపబ్లిక్‌లో 23 సంవత్సరాలుగా ప్రచురితమవుతున్న, "పాఠశాల పూర్వవిద్య" అన్న మాసపత్రిక, శిశుపోషణాలయ నిర్వాహకులకు చాలా తోడ్పడుతూంది.

("టాస్" నుండి)

---o---

# గిజగాడు



'కవిచంద్రులు' కోటసోదరకవులు, అష్టావధానులు

నీరచనావిధంబు గమనించితి పెక్కుదినాలనుండి, నా
నారమణీయ కావ్యముల నారతమున్ పఠియించి కైతలన్
నేరచియింపలేనయితి, నీవలెనో గిజగాడ! నీకు జో
హారు; త్వదీయనీడ రచనాద్భుత సృష్టికి దీవనాక్షతల్-

ముక్కున కందుబాటయిన, పోచలపుల్లల సేకరించి, నీ
మక్కువకొద్ది యల్లితివి, మగ్గముగల్గిన సాలెయీగతిన్
చిక్కగనేయలేడు, ఫలసిద్ధికి నేర్చిన విద్దెలెవ్వియో
దక్కియడంగె నీమెడద తామరచూలి విచిత్రకల్పనల్

గడచినగాథల కతలుగా వ్రాయు కవి
కలమందుమురిపెముల్ గులుకు నేర్పు,
జిలుగువన్నెల జీవ సృష్టిజేసెడు శిల్పి
కుంచెలై యెపుడు నటించుశక్తి,
కొంగ్రొత్త చాయపోగులగూర్చి నేసెడు
తంతువాయుని నేతతనముసొంపు,
నలువజేసినసృష్టి ననుగమించెడిరీతి,
వింతసృష్టినిజేసి వెలయునేర్పు,

నీకులాయ నిర్మాణ మనీషయిపుడు
చాటుచున్నది దేశాలపాటవముగ
భారతక్షోణి ప్రాచీన భవ్యకళల
నాధునిక కళాప్రతిభల నతిశయించి.





## పెరుగు బర్ఫీ

ఒక వస్త్రములో పెరుగునుకట్టి, అందున్న నీరంతయు పోయినపిదప పన్నెండు తులములు కట్టు పెరుగును పాత్రలోపోసి పొయ్యిమీద పెట్టవలయును. అప్పుడే పన్నెండు తులముల చక్కెరనుగూడా వేసి చక్కగా పాకమయిన తరువాత మూడుతులముల పాలలో అరతులము గోధుమపిండిని కలిపి, పక్వమైనటువంటి పంచదారపాకములో వేయవలయును. యివి అన్నియు కలిసి గట్టి పాకమైన పిమ్మట మూడు తులముల నేతిని వేసి ఉడికించి, ఒక తబుకుకు నెయ్యి రాచి అందులో పాకముపోసి ఒక తులము ఏలకల పొడి చల్లి కత్తితో ముక్కలు ముక్కలుగా కోయవలెను.

## నారింజకాయలజెల్లి (Orange jelly)

ఆరు పెద్ద నారింజకాయలను 3 నిమ్మకాయలను కడిగి సన్నగా తరిగి, గింజలు తీసివేయుము. ఒక్కొక్క కోపా నారింజపండుగుజ్జు రసమునకు మూడుకోపాల మంచినీళ్లు చేర్చుము. ఒక గంటసేపు బాగా ఉడకనిచ్చి, పిమ్మట బట్టలో ఆపదార్థమంతటిని పోసి, క్రిందికి రసమంతా దిగునట్లు ఒక కుర్చీ క్రిందగాని, బల్లక్రిందగాని కట్టుము. ఇట్లు ఒకరాత్రి అంతా వుండనిచ్చి లేదా 24 గంటలుండనిచ్చి, క్రిందిడేక్షాలోనికి దిగిన రసమునకు ఎత్తుకు ఎత్తు చక్కెర కలిపి పొయ్యిపై పెట్టి, గరిటినుండి చుక్కలు చుక్కలు పడువరకు వండి, చల్లారిన వెనుక శుభ్రమైన గాజుబాటిల్ లో పోయుము. ఇది చెడిపోదు. రోగులకు మంచిది. రొట్టెలు, అట్లు (దోసెలు) అనువానిపై వేసుకొని తినుటకు పనికివచ్చును.

## బంగాళాదుంపల పుడ్డింగ్ (Potato pudding)

పెద్ద బంగాళాదుంపలు నాలుగింటిని (ఉర్లగడ్డలు) నీటిలో బాగుగా ఉడకనిచ్చి, చర్మము తీసివేసి, వానిని మెత్తగా రుబ్బి, చల్లారిన వెనుక రెండు టీకోపాల పాలు ఒక ఔన్సువెన్న, రెండుపెద్ద గరిటెల చక్కెర, పావుటీస్పూన్ జాజికాయపొడి దానితో కలిపి బాగుగా కొట్టినవెనుక, ఒకగిన్నెకు నేయిరాచి దానిలో పైదంతయుపోసి, వేడిబూడిదమీద నాగిన్నెనుంచి చీనారేకును మూతపెట్టి, మూతపై నిప్పులు పోసి, రంగువచ్చి గట్టిపడువరకు నుంచి పిమ్మట ఇవతలకితీసి చల్లారనిచ్చి, కత్తితో కోసి భుజింపవలయును. ఒకచిటికెడు ఉప్పుమరువరాదు.

వాశిరెడ్డి సుశీలాదేవి

## పోలెబూరెలు చేయువిధము

సోలెడు పెసరపప్పు నీళ్లలో నానబోయవలెను. బాగుగా నానినతరువాత శుభ్రముగాకడిగి మెత్తగా రుబ్బవలెను. వెడల్పయిన పాత్రకు మూతికిగుడ్డకట్టి పాత్రలోనీళ్లుపోసి, రుబ్బినపిండిని వాసనమీదవుడికించవలెను. ఒక టెంకాయకొట్టి కొబ్బెరనుతురిమి నేతిలో ఎఱ్ఱబడునట్లు వేయించవలెను. ఒకసవాశేరుసవాపావు బెల్లమును పాకముబట్టవలెను. వాశనమీద వుడికినపిండిని వుండలులేకుండా చిదిపి పొడిచేసి యుంచవలెను. అరిశెలపాకమురాగానే యాలకుపొడి, వేచిన కొబ్బరి వాశనపిండి పాకములోపోసి బాగా కలియపెట్టవలెను.

తరువాత నిమ్మకాయలంతటి వుండలుచేసి యుంచుకొనవలెను. తవ్వెడు బియ్యమునకు గిద్దెడు చాయచేసిన మినపప్పుకలిపి మెత్తనిపిండివిసిరి యుంచుకొనవలెను. ఆపిండిని ముందుగానే అట్లపిండిపాకముగా ఉప్పు వేసికలిపి సిద్ధముగా యుంచుకొనవలెను. ఒకసోలెడునెయ్యిని పొయ్యిమీదపెట్టి బాగుగా కాగినతరువాత ఆవుండల నీపిండిలోముంచి వేగించిన యెంతో బాగుండును. యీ మాదిరిగా చేసిన బూరెలు 15 రోజుల వరకు నిలువయుండును. చిరితిండికి వేధించే తీపియిష్టమైనపిల్లలుగల యిల్లాలికి అనుకూలమైన పిండివంట.

### పిండిమిరియము చేయుమాదిరి

తగుమాత్రము బియ్యము, సెనగపప్పు, యింగువా, కొద్దిచమురుతో మిరపకాయలు మినపప్పు ఆవాలు మెంతులు, మిరియాలు, ధనియాలు వగైరా దినుసులు సమపాళముగా వేయించవలెను. సరిపడు కందిపప్పు వేయించిగాని, పచ్చిదిగానీ మెత్తగా వుడుక పెట్టవలెను. కాకరకాయ ముక్కలు నీళ్లతో కడిగి వంచి పొయిమీద పెట్టవలెను. చింతపండు పులుసు, వుప్పు, పసుపువేసి బాగుగా యిగరనిచ్చి, వుడికిన కందిపప్పులో వేయవలెను (లేకపప్పుతోనే వుడకపెడితే చేదువిరుగదు.) మరికొంత పల్చని పులుసు పోసి సన్నని మంటమీద తెల్లనివ్వవలెను. పైజెప్పిన వేచినదినుసులలో కావలసిన వుప్పువేసి గుండకొట్టి నీళ్లతో బాగా నూరవలెను. ఆ నూరిన పిండిని కాగుచున్న పప్పుపులుసులో పోసి అడుగంటకుండా నెమ్మదిగా కలియపెట్టి దించవలెను. కళాయి గిన్నెతోగాని, రాతిచిప్పతో గానీ తయారు చేసుకొనండి. పిల్లలుగల వారి యిండ్లలో రెండుపూటలకూ అటివచ్చును. యీ ప్రకారము అంటు పులుసుతో, వండుకొనే ప్రతికూర ముక్కలతోను చేయువచ్చును. ముఖ్యముగా పెద్దకాకరకాయా, అరటికాయ సన్నచిక్కుడు, పెద్దచిక్కుడు ములగకాయలతో బాగుండును. తరువరి వారి అభిరుచులనుబట్టి వుండును.

# బ్రతుకు తెరువు

—(o)—

## కూరగాయల సాగు

పాలకు తర్వాత ఆహారమునందలి లోటుపాట్లనుతీర్చి మంచి ఆహారముగా నుపక రించగలవి కూరగాయలు, పండ్లు; కాని ప్రస్తుత రోజులలో ఆహార ధాన్యాలతోబాటు కూరగాయలు, పండ్లధరలుకూడ గరిష్టముగానున్నవనుట మనకందరకు తెలిసినదే.

కాయగూరల ధరలు పెరిగినవని మనము విమర్శించడము తగదు. ఎందు కంటారా ? బజారులో దైనికావసరమయిన వస్తువుల ధరలు పెరిగిపోతున్నప్పుడు కూర గాయల నమ్ముకొని జీవనముచేసేవారు కూరగాయల ధరలు పెంచక తప్పడంలేదు. కాని కాయగూరలను చౌకగా సామాన్య ప్రజానీకానికి సయితము అందుబాటులోనికి తెచ్చుకొనుటకు అవకాశములున్నవి. ఇది స్వయంకృషివలననే జరుగవలెను.

కూరగాయలను పండించడం గౌరవహీనంకాదు. పైగా ఆరోగ్యకరమైన ఆహార మును సమకూర్చుకొనవచ్చును, తమ అవసరాలుతీరగా మిగిలియున్నవానిని అమ్ము కొనవచ్చును. కూరగాయలను పండించుటకు శక్తిమించినశ్రమ అవసరంలేదు. తమ శక్తికొలది భూవిస్తీర్ణములో పండించవచ్చును. పల్లెలలోను, పట్నవాసములలో సయి తము నీటివసతి ననుసరించి కృషిచేసిన మంచిలాభమును సయితము పొందగలరు.

నేలను పారతోగాని, క్రరుతోగానితవ్వి మట్టిలోని చిన్నచిన్నరాళ్లను, పెంకులను, గడ్డిమొక్కలను ఏరిపారవేయవలెను. పిదప చదరముచేసి నీళ్లుచల్లి భూమిని పదును చేయవలెను. పాదులు చేయవలసి యుంశినచో చేయవలెను. లేదా నాటుటయే యైనచో నియమిత దూరము ప్రకారము నాటవలెను. కూరగాయల చెట్లను మన యిండ్ల దొడ్లలో పెంచుట అవకాశములుమెండు. సాధారణముగా దొడ్లలో భావు లుండును. భావుల నీరును చెట్లకు పోయవచ్చును.

సాధారణముగా మనయిండ్లలో వాడుకయందున్న కాయగూరలు బీర, పొట్ల, కాకర, సొర, రామమునగకాయ, తోటకూర, గోంగూర మొదలగు వానిని ఆషా మాషీగా పండించవచ్చును.

ఏవిత్తనములైనను నాటుటకుముందు బాగుగా పరిశీలించవలెను. లేనిచో పుచ్చిపోయిన విత్తనములుండిన మొలవవు. బీర, పొట్ల, కాకర సొరపాదులను 24 చ. అ॥లకు ఒకపాదు ప్రకారముచేసి విత్తనములు నాటవలెను. రెండుమూడు రోజులలో మొలకలెత్తును. ఉదయము, సాయంకాలము నీళ్లు చల్లుచుండిన మొక్కలు క్రమంగా పెద్దవయి తీగెవేయ మొదలిడును. అప్పుడు అల్లు పందిళ్లు ఏర్పరచి వానిమీద నల్లుకొనునట్లు అమర్చవలెను.

కాపు ప్రారంభమయి నప్పటినుండి రెండు మూడు నెలలు సమృద్ధిగా ఫలించును. వేసవికాలములో నాటినచో వానాకాలము నాటికి పంట పూర్తిగా నుండును. మన దైనికాహారములో వాడతగినవి, ముఖ్యమైనవి రామమునగకాయలు (టమాటో). ఇవి మంచి ఆరోగ్యకరమైన ఆహారము. వానిలో నాలుగైదు ఉత్తమరకములు గలవు. టమాటోపండ్లను వండితినుట కంటె యధారూపంగా తినుట మంచిది. ఈ పండ్ల యందలి విలువమైన ఆహారపదార్థము ఉడికించినచో విలువతగ్గును.

టమాటో పండ్ల చెట్లను మన దొడ్లలో పెంచవచ్చును. మొదట విత్తనములను చల్లి నారుపోసి తర్వాత నారును 12 చ. అ. దూరమున కొక మొక్క ప్రకారము నాటి క్రమముగా నీళ్లు పోయుచుండినచో 5మాసములలో పూర్తిపంటకు వచ్చును. పండ్లనే కాకుండా పచ్చికాయలను కూడ కూరగాను, పప్పులోను వేసి మనయిండ్లలో వాడుదురు. పచ్చికాయలు ఆరోగ్యమునకు మంచివికావు.

తోటకూర, గోంగూర సర్వకాలములందు పైరగునవి. తోటకూర విత్తనములను మడిలోచల్లి నీళ్లుచల్లుచుండిన మొక్కలు మొలచి పెరుగుచుండును. ముదురు మొక్కలను పీకి ఉపయోగించుకొనవచ్చును.

గోగు విత్తనములను వరుసలలో నాటి నీళ్లు చల్లుచుండిన క్రమంగా మొక్కలు మొలచి పెరుగును. ముదురు మొక్కల ఆకును ఉపయోగించుకొనవచ్చును.

ఈ విధంగా కాలమునుబట్టి కూరగాయలను, ఆకుకూరలను పండించుట వలన మంచి ఆహారమును సమకూర్చుకొనుటయేకాక అధికముగానున్న వానిని అమ్మి లాభముకూడ సంపాదించవచ్చును.

చివుకుల లక్ష్మీకాంతమ్మ.

——(o)——

# ఇంటిపనులలో మెళకువలు

## గృహనిర్వహణ — సాధారణ ప్రమాదాలు

### ప్రథమ చికిత్స



కట్టుకున్న బట్టకు నిప్పంటుకుంటే ఎలా ప్రమాదమునుండి జాగ్రత్తపడాలో చెప్పాను. చేయి కాలడం, కాలు కాలడం - వేడినీళ్లు, వేడినూనెపడి బొబ్బలెక్కడం - ఇళ్లల్లో నిత్యం చూస్తూనే వుంటాము. కట్టుకున్నబట్ట కాలిన ప్రదేశంలో వుండిపోతే, ఆగుడ్డను ఎంతమాత్రం బలవంతాన లాగకూడదు. దానంతటదే కాల్పుడు మానగానే వూడివస్తుంది. నూనెగాని, Vasaline గానీ కాల్పుడు పుళ్లమీద వేస్తే మంచిది. సాధారణంగా ఎక్కువగా కాలడం సంభవిస్తే, స్పృహతప్పుతుంది. ఆసమయాల్లో, ఆమనిషిని వెచ్చగావుండే ప్రదేశంలో పరుండబెట్టి, బాగా వేడిపాలుగానీ, కాఫీగానీ ఇవ్వాలి.

### నీటిలో మునిగిపోయి చనిపోయే ప్రమాదాలు

నీటి ప్రమాదాలనెన్నిటినో వింటుంటాము. సరిగ్గా ఈతరాక లోతైన నీటిలోదిగి మునిగిపోవడం, కాలుజారి మునిగి పోవడం జరుగుతుంటాయి. మునిగిపోయిన మనుష్యులను ఒడ్డుకు చేర్చినప్పుడు నీరుత్రాగేసి ఉఛ్వాస నిశ్వాసములు లేకుండాపోవును. అటువంటప్పుడు Artificial respiration ఇచ్చి, ఏ మాత్రం కొనవూపిరివున్నా ప్రాణదానం చేయవచ్చును. మొదట వూపిరి పీలవడానికి ఏమైనా ఆటంకాలుంటే, వానిని వెంటనే తొలగించాలి, వుష్ణము తిరిగి శరీగమునకు కల్గించేందుకుచూడాలి. వెచ్చని పానీయాలియ్యాలి. రగ్గులు బాగా వెచ్చగా కప్పాలి. తర్వాత డాక్టరు వచ్చేలోపుగా Artificial respiration ఇవ్వాలి. అది ఎలాగంటే, వంటిమీదవున్న బట్టలు తీసివేయాలి. బోర్లా పడుకోపెట్టాలి. ప్రక్కగా వంగివుండి, రెండు చేతులతో, వూపిరితిత్తుల ప్రాంతంలో నొక్కి తర్వాత నిటారుగా నొక్కాలి. ఈవిధంగా చేస్తూఉంటే ఉఛ్వాస నిశ్వాసాలకి సహాయం కల్గుతుంది. ఒక్కసారి చేతులెత్తకుండానే బరువుతీసినట్లు కొంచెము వెనక్కు తగ్గాలి. మునిగిపోయిన మనుష్యులకు రెండుమూడు గంటలసేపు Arlificial respiration ఇచ్చినతర్వాత, బ్రతికినవారున్నారు. కాబట్టి డాక్టరు లాభంలేదు అని చెప్పేవరకూ Arlificial respiration ఇస్తూనే వుండాలి.

హఠాత్తుగా ముక్కుమ్మట కొందరికి రక్తంకారుతుంది. అటువంటప్పుడు ఎంతమాత్రం కంగారు పడకుండా ఆమనిషిని బాగాగాలితగిలే ప్రదేశంలో ఒక కుర్చీవేసి తలకొంచెం వెనక్కు వంచుకొనుండేలాగ కూర్చోబెట్టాలి. గుండెలచుట్టూ, మెడచుట్టూ బిగుతుగా వుండే వస్త్రాలను సదలించాలి. తడిగుడ్డతోగాని మంచుముక్కతోగాని ముక్కుమీద, మెడవెనుక భాగంలోనూ బాగారుద్దాలి. ముక్కుతో గాలిపీల్చకుండా నోటితో గాలి పీల్చమని చెప్పాలి. పాదాలు గోరువెచ్చని నీటిలో వుంచాలి.

విషపు కాటులగురించి కూడా తగినంత జాగ్రత తీసుకోవాలి. పాము కాటు అని తెలుసుకోడానికి రెండుకాట్లు పడతాయి. కాటుకీ, కాటుకీ మధ్య ఒక అంగుళం దూరంవుంటుంది. డాక్టరు వచ్చేలోపుగా, విషము గుండెలకు చేరకుండా వుండేందుకుగాను, గుండెలకు చేరువగా ఒక గుడ్డగట్టిగా కట్టాలి. తర్వాత కాటుకి కొంచెముపైగా మరోకట్టు కట్టాలి. మంచి వేడి పానీయాలివ్వాలి. కాటుపడిన స్థలంలో, కత్తితో గీట్లుగీసి, లోపలికి Permanganate బాగా రుద్దాలి. వైద్యసహాయం వెంటనే పొందాలి.

తేలుకాటు: - తేలుకాటుకి మంచిమందు ఏమిటంటే Ammonia, లేకపోతే నీరుల్లిపాయి, పొగాకు రసం - కుట్టిన చోటవేసి బాగా రుద్దాలి.

కాలుజారి పడడం ఎంతో సాధారణమై పోయింది. ముఖ్యంగా ప్రాలుమాలికతతో చాలామంది అరటిపండ్ల తొక్కను రస్తామీద పారేస్తారు. అరటిపండు తొక్క ఏమిప్రమాదం కలిగిస్తుంది అని వారివూహ. నిజానికి అరటిపండు తొక్క ఎటువంటి ఘోర ప్రమాదాలకు కారణమగుతుందో చెప్ప తరంకాదు. పొరబాటున కాలు ఆ తొక్కమీదపడి జారిపడతారు. అప్పుడు కాళ్లూ, చేతులు విరగవచ్చును. దీనినే Fracture అంటారు. అంటే ఎముక విరగడం.

ఎముక విరిగినప్పుడు ఏవిధమైన ప్రథమచికిత్స చేయవలయునో విపులంగా తెలుసుకోవాలి. ఎముక విరిగినభాగం కదలకుండా వుండేందుకుగాను కర్రలు-Splints వాడాలి. ఎముకవిరిగిన ప్రాంతంలో కర్ర ముక్కలను పూర్తగాపెట్టి, గుడ్డతో గట్టిగా కదలకుండా (Bandage) కట్టుకట్టాలి. Fracture జరిగిన తక్షణం చేయవలసిన పనేమిటంటే :

1. డాక్టరుకి కబురుపంపాలి.

2. ఎముక విరిగిన ప్రాంతంలో, రక్తస్రావంవుంటే, కర్రలు-Splints వేసి కట్టుకట్టేముందు రక్తస్రావాన్ని ఆపుచేయాలి.

3. తగిలినగాయం, ఏమైందీ తెలియని పక్షంలో, Fracture కి చేసే ప్రథమచికిత్సే చేయాలి.

4. ప్రథమచికిత్స చేసిన తర్వాతనే, గాయపడ్డ మనిషిని ఆస్థలంనుండి మార్చాలి.

5. గాయంవల్ల ఇతర ప్రాంతాలకి తదితరగాయాలు తగలకుండా వుండేందుకు తక్షణం కట్టుకట్టాలి.

6. త్వరితంగా స్పృహ వచ్చేందుకు గాయపడినమనిషిని, వెచ్చని ప్రదేశంలో వుంచాలి.

7. వెన్నెముక, పొత్తికడుపు చుట్టూనుండు అస్థిపంజరం, లేకతొడలోని ఎముకగాని, విరిగినట్లైతే, ఆ మనిషిని లేవనియ్యకుండా పడుకోపెట్టాలి.

ఈ మోస్తరుగా, గృహనిర్వహణంలో ఎన్నో ప్రమాదాలు సంభవిస్తూంటాయి. వాటన్నిటినుండీ, ప్రాణినిరక్షించి, వైద్యసహాయం పొందాలంటే ప్రతిఒక్కరు, ప్రథమచికిత్స నేర్చుకొనితీరాలి.

ఎమ్. సుశీల.




## సులభ చికిత్సలు

శిశుప్రాయ, బాల్యావస్థలలో తల్లులు తమ పిల్లలు నీరసముగాను, కృశించి యుండుటనుగూర్చి తలపోయుచుందురు.

పిల్లల కడుపులో క్రిములున్న నశించుట, కృశించుట తప్పదు. ముఖముయందు కళాకాంతులు తప్పును. అట్టివానికి.

| | | |
|---|---|---|
| ఇంగువపాలు | $\frac{1}{4}$ | ఔన్సు |
| వేపపీనెల కషాయము | $\frac{1}{4}$ | ఔన్సు |

చేర్చి ప్రతిసాయంత్రము నాలుగైదు రోజులు విడువక యిచ్చిన ఎలిక పాములు, నులిపురుగులు మలమువెంట పడిపోవును. ఆకలి అగును. ఏడుపుపోవును. నిద్ర హాయిగపట్టును. బిడ్డలపెంపును వృద్ధిపొందించును.

### దంతవ్యాధులకు

ఉదయమున మేల్కాంచిన వెంటనే దంతధావన మనకు ప్రాధాన ఆరోగ్య విషయమయియున్నది. గొప్ప పరిశోధకులు దంతవ్యాధులవల్లనే పలువిధములయిన జాడ్యము లేర్పడుతున్నవని వక్కాణించుచున్నారు. చిగుళ్ళకు, దంతములకు, త్వరలో కుళ్లుబట్టకుండుటకు దివ్యమయిన దంతధావన చూర్ణమొకటికలదు.

| | |
|---|---|
| కాచు | ముద్ద సీమసున్నము |
| హారతి ముద్దకర్పూరము | బొగ్గుల చూర్ణము |
| మాచికాయ | ఉప్పు - మెంతాలు |

ఉప్పు, మెంతాలు తప్ప మిగత అన్నియు సమభాగములే. మెంతాలు మాత్రము 2, 3 చిదుపలు చాలును.

వీటినన్నిటిని బాగుగ చూర్ణించి వస్త్రకాళిత మొనర్చి శుభ్రమయిన సీసాలో వేసి వుంచుకొని వాడుకొనుచుండినయెడల దంతవ్యాధులు దరిజేరవు.



# చదువుకుంటే?

శ్రీ అయ్యగారి వి. వ. నరసింహమూర్తిగారు

(విద్యావతి ధర్మపత్నిగనున్న ఫలమేమి? ఎందరు నిరక్షరాస్యులగు భార్యలు తమ భర్తల నానంద డోలికల విహరింపజేసి తమ సంసారములను, కుటుంబములను నానందనిలయములు చేయలేదు? విద్యావతికడనున్న విశేషమేమి? విద్యారహితయగు నొక గృహిణి సంతోష స్వాంతయై సంసారము నెఱపుచున్నదనునది యామె యదృష్టము. విద్యావతి తన గృహమును వసంతోత్సవ తుల్యముగా నొనర్చినదన్నయది యామెకృషి, నైపుణ్యము. జ్ఞానరహితయైన గృహిణి జీవనము స్వల్పలాభాపేక్షలతో నిండియుండును. విద్యావతియగు గృహిణి జీవనము, ఎంత సాధారణమైనదైనను సంఘోపకారియై వెలయును. అట్లయిన విద్యావతియగు భారతి గృహము ఆనందనిలయమా? సంఘోపకారి యెట్లయినది? ఆమె విద్య ఎంతవరకక్కఱకు వచ్చినది? ఈ ప్రశ్నలకు సమాధానము కావలెనన్న ఆమె గృహిణీ జీవితములో నొక్క ఘట్టముతిలకించిన చాలును.)

ఆమె భర్తకు యేదో కంపెనిలోపని. ఆమె ఎప్పుడును సాధారణమైన దుస్తులనే ధరించుచుండును, నిజము చెప్పవలసివచ్చిన విద్యావతులైన నవ్యనారీమణులలో చాలమంది సాధారణముగనే యుందురు, వారికి నిరాడంబర జీవితముపైనున్న మక్కువ మరి ఎవరికినియుండదు. తమ వ్యక్తిత్వము పూర్తిగా వికసించువరకు కన్యలుగానుండి, ఉన్నతవిద్య నభ్యసించి, తమ హృత్కమలములను ప్రేమరసైక లేకిరణములచే వికసింపజేయగల భర్తకొరకు నిరీక్షించుటతప్ప వారిలో పెద్దలోపముల నెన్నబూనట వారిని సరిగా నర్థము చేసుకొనక పోవుటయేయగును. వారన్వేషించునది హృదయము. సామాన్య గృహనిర్వహణకు తగిన యార్థికవ్యవస్థ. ఇవి రెండును నవయువకుల యొడనున్నగదా వారికిచ్చుట! ఒక వంక విద్యాలయముల ధర్మమా అని విద్య గఱచుట కష్టతరమై మఱియొకవంక ప్రభుత్వము ధర్మమా అని పోషణపదార్థములు తక్కువై ఒక వంక పెట్టుబడిదారుల ప్రళయ తాండవమునకు, మరియొకవంక లజ్జావిహీనులైన లంచగొండిదారుల లఘువర్తనమునకు మధ్య 'ఉద్ధతులమధ్య నేరికి సుందతరమె' యని నలిగి, కృశించుచున్న నవయువకులకు హృద్రోగము, నైరాశ్యము, నిరుత్సాహముతప్ప హృదయము, ఆర్థికవ్యవస్థ ఎక్కడివి? హృదయమున్నది యున్నగాని హృద్రోగముండుట కవకాశము లేదుకనుక హృదయమున్నదని ఒప్పుకొనవలసియున్నదిగాని, ఆ హృదయము ఒకరి కిచ్చుటకుగాని, మరియొకరికి చోటు చూపుటకుగాని పనికివచ్చునా? ఇట్లు హృదయము, ఆర్థికవ్యవస్థ లేక విద్యావతులై, గృహిణీత్వమున కర్హులగు వారి నెందరినో చేజారిచి, చివరకేదో ఒక స్త్రీమూర్తికి అమ్ముడు పోవుచున్నారు. కాని భారతి యేరికోరి యన్ని విషయముల యందును నర్హుడై, వరశుల్కవ్యతిరేకియై, ఆమె మానససరోవరతరంగ డోలికల విహరింపగల రాయంచయగు జగన్మోహనరావును వివాహము చేసుకొన్నది.

నాడు ఆమె తన చిన్నికుమారుని ఒడిలో వేసుకొని యేదో జోలపాటపాడుచు వీధి చావిడిలో కూర్చున్నది. పదిగంటల రాత్రియైనగాని భర్త యింటికిచేరడు. సంసారము ప్రారంభించిన మొదటి మూడు నెలలుతప్ప నేటికి మూడు సంవత్సరములనుండి అతడట్లే చేయుచున్నాడు. లోపమెవరిది? తనదా? భర్తదా? భర్త వింతధోరణి ఆమెకు అర్థముకాక నేడేదో యాలోచించుకొనుచు తప్పెవరిదో నిశ్చయము చేసుకొనుటకు ప్రయత్నము చేయుచున్నది. ఇంటిపనులతో సాధారణముగా నిట్టి యాలోచనలకే

ఆమెకుతగిన వ్యవధి యుండెడిదిగాదు. వ్యవధియున్న సమయములలో తప్పెవరిదియన్న విషయము నిర్ణయము కానట్లున్నది. కాని నేడు మాత్రము యిదమిత్థం అని నిర్ణయించుకొనుటకు నిశ్చయము చేసుకున్నది.

భర్తలోపమా? అతడుచేసిన నేరమేమి? ఉదయం ఏడుగంటలకు ఇంటినుండి వెడలి, తిరిగి తొమ్మిది గం॥లకు వచ్చును. భోజనమైన తరువాత ఆఫీసుకువెళ్లి రాత్రి 10 గం॥లకుగాని ఇంటికిరానే రాడు. ఆఫీసులో పనియున్నదనుకొనుటకు, పెద్దపట్టణములలో సాయంత్రము నాలుగంటలయిన తరువాత జవానులైనను ఆఫీసులోనుండరు. మొదటి మూడునెలలో ఆఫీసు విడువగనే యింటికి వచ్చెడివాడు. ఇప్పుడట్లుచేయలేదు. ఏమైన వ్యసనములకు గురియైయుండునా? జీతమందగనే పూర్తిగా ఆమెకు యిచ్చి వేయుచున్నాడుకదా? వ్యసనాశక్తుడైన వాడట్లు చేయగలుగునా? పోనీ, ఎట్టివ్యసనములు? త్రాగుడా? ధనమెక్కడిది? అట్లే యగుచో యీ మూడు సం॥లనుండి ఒక్క పర్యాయమైనను, వెలితి పడకుండ వ్యవహరింపగలుగునా? జూదమా? దానికైనను ధనమువలదా? అట్టి యభ్యాసమున కలవాటుపడినవాడు ప్రతిదినమును సరిగా పదిగంటలకు (ఆలస్యమే యగుగాక) ఎట్లు రాగలుగుచున్నాడు. లేదా? మరియే స్త్రీమూర్తియైన యాతని హృదయము హరించినదా? అట్లగుచో వేళ తప్పి విచ్చలవిడిగా విషయార్థివలె విహరించునేగాని, విద్యార్థివలె సమయపాలన యెట్లు పాటింపగల్గును? ఆమెకెంత యాలోచించినను, యాతని ప్రవర్తనమునకు తగుసమాధానము చిక్కకున్నది. వేళపాళలయందు తన్నెంతగా మోసము చేయగల్గినను, తనపట్ల యాతని ప్రవర్తన యందేమైన మార్పుగలదా? ఇదివరకువలె నింటిపట్టున యుండుటలేదుగాని, అతడు యింటికి చేరినంతనే యానందముగ ప్రవర్తించుటలేదా? ఒక విధముగా నట్లుచేయుటయే మంచిదేమో? భర్త, భార్యను యన్నివేళలయందును అనుసరించి తిరుగుట వలన మేలుకన్న కీడేయెక్కువగా నుండునేమో? అట్లగునని 'ది రిటర్న్ ఆఫ్ ది నేటివ్'లో థామస్‌హర్డీ, మియిన్ కేంఫ్‌లో హిట్లరు చెప్పలేదా? సర్వావస్థలయందును భార్య కనులపండువగా కన్పించుట దుర్లభముగదా! సాయంత్రము యిల్లుచేరునప్పటికి:—

'వ్రాలిన నీలిముంగురు వారిధరంబులుగా శిరంబుపై
గ్రాలుజరీమసుంగది పురంధర చాపముగాగ చూడ్కుశం
పాలతగా రహిన్ప్రణయ వర్షసమాగమ సంభ్రమంబునన్
జేలిచి యాతని ... శ్రమమున్ మరపించె నొక్కటన్'

(దరిమడుగు కామయ్యగారి 'భారవి'లోనిది)

అన్నట్లుగా భార్యయుండుట మంచిదిగాని, 'మనంబున నెయ్యపు కిన్కశివాని తాచిన యది నాకు మున్నవరయె' యని వెనువెంట తిరుగుభర్త 'భావజామర్మకర్మములకు' భార్యకు భర్తపట్ల హేయభావమే కల్గునేమో? క్రీగంటచూపు పూబంతులహారముల నర్పించునవోఢవలె కన్పించుటకు తగినంత వ్యవధి యిచ్చుచుండుటవలన ఎక్కువ ప్రయోజనమున్నది. ఏమో ఎంత ఆలోచించినను ఎన్నదగిన లోపము లెవ్వియు ఆమెకు స్ఫురించుటలేదు.

తన లోపమేమైననున్నదా? అప్పుడుగాని ఇప్పుడుగాని తనలో యెట్టి లోపమును లేనట్లే తోచుచున్నది భారతికి. సంసారం ప్రారంభించిన నెలరోజులకే ఆమె భర్తను తన్నంటిపెట్టుకొని తిరుగవద్దని మందలించినది. కాని ఆనాటినుండి యీ మార్పు రానేలేదు! అతడు నవ్విమాత్రమూరుకొనెనుగాని,

యట్లుచేయుట మానలేదు. అందుచే అది తగినంత కారణముగా కన్పింపలేదు. అట్లు చెప్పుటలో యెట్టి దోషమును లేదని ఆమెకు పూర్తియైన నమ్మకమున్నది. అందును తన్ను పూర్తిగా అర్థము చేసుకొనగలిగిన జగన్మోహనుడు నిజము గ్రహింపగల్గునేగాని, కోపము తెచ్చుకొనవలసినవాడు కాడు. పోనీ, రెండవ నెలలో 3వ తేదీని తనకు క్రొత్తచీర రు 50/- పెట్టికొన్నప్పుడు తీసుకొనలేదని కోపమువచ్చినదా? స్వయంకృషిపై ఆధారపడి సాధారణ గృహస్థుడుగా ఉండుట మంచిదికాని, లంచములు తీసుకొని లక్షాధికారివలె నుండుటకు ప్రయత్నముచేయుట చాల అన్యాయము, ద్రోహం అన్నమాటకు, ఆ వాక్యములోని యదార్థమును గ్రహించి, యికనెన్నడును లంచము పుచ్చుకొననని ఒట్టుపెట్టుకొననేగాని, కోపము తెచ్చుకొనలేదే. పోనీ, కోపము ప్రదర్శింపకపోయినను, మార్పు వచ్చినదనకొందమన్న, ఆసంఘటన జరిగిన మరి నెలరోజులకుగాని 'ఎట్టిమార్పునకలుగలేదే! మనిషిలో యేమంత పెద్దమార్పులు కన్పించుటలేదు. తనపట్ల ప్రేమ సంటుపడిందనుకొనుటకు యీషన్మాత్రమైన నాధారములేదు. మరి యిప్పటి మార్పునకు కారణమేమైయుండును? బుర్ర యాలోచనలతో గిర్రునతిరుగుచున్నది.

పాపాయి నిద్రలోనే బోసినోటితో మందహాసము చేసెను. ఆ పిల్లవానిని రెండుచేతులతో ఎత్తి చెంపకు చెంపచేర్చి తిరిగి ఒడిలో పరుండపెట్టినది. చాలసేపుగా నిద్రపోవుచున్న యాబిడ్డను వుూయలలో వేయవలెనన్న యాలోచనకూడ లేకపోయినదామెకు. భర్తప్రవర్తనపైకన్న తన సహనశక్తిపై యేవగింపు కల్గినది. ఈ మూడు మాసములనుండి యాతనిని యాతని ప్రవర్తనగూర్చి యడుగుటకు సాహసము లేకపోయెను. కాని నేడు ఆమె ఆలోచనలు తీవ్రరూపము దాల్చినట్లగుపడుచున్నది. ఆమె సహనశక్తి పరిణితి దాటుచున్నదేమో!

నిండారు యౌవ్వనమున పొంగారు పాలిండ్లభరముచే 'లేనడు మల్లలనాడు' తనూ విలాసముతో నన్నియు తానేయని నమ్మివచ్చిన యర్థాంగి 'వేశ్యయై, దాసియై, మాతయై' ప్రవర్తింపవలెనని యనుకొనుటకంటే భర్త చేయదగ్గ పాపము మరి యెద్దియునుండదు. ఇట్టి వెర్రివేషములన్నియు కట్టిపెట్టి, ఆమె కూడ తనవంటి రాగద్వేషములుగల మనిషియని, యంత్రము కాదని పురుషుడెంతత్వరలో గుర్తింపగల్గిన నంత మంచిది. వారి 'ప్రసూతాంతః యౌవన' దోషము సాధారముగా చేసుకొని, వారి యార్థిక నిస్సహాయతకు మనముననలరుచు స్వైరవిహారముచేసెడి రోజులు సెలవుతీసుకొనచున్నవను విషయము తెలుసుకొనవలసియున్నది. తను స్వయంశక్తిపై నాధారపడుటకు తగిన విద్య, ఉత్సాహము కలిగియున్నది. అతని యడుగులకు మడుగులొత్తుచు తిరుగవలసిన అవసర మెంతమాత్రమును లేదని నిర్ణయించుకొన్నది. పోనీ ఆ చేసెడి ఉద్యోగమెద్దియో యిప్పుడే యేలచేయరాదు? తానుకూడ యుద్యోగమున చేరిన బాగుండియుండును. అప్పుడింత చులకనగా చూడగల్గియుండునా? తానుద్యోగము చేసిన సంసారమునంతటిని నౌకరలకప్పగింపవలసినదేగదా? తనుకూడ నుద్యోగము చేయనేల? ఒకరి జీతము నౌకరులకు పోయనేల? ఉభయులును ఉద్యోగములు చేసినయెడల సొమ్ము చెల్లిపోవుట, సౌఖ్యము దక్కకపోవుట మిగులునుగాని మరియెట్టి ప్రయోజనము నుండదు. గృహిణి నెఱుపవలసిన కార్యము లెన్నియోయున్నవి. చిట్టిపాపను తనంతప్రేమగా చూసెడివారెవరు? అవి అనుకొనుచు పాపాయిని ఎత్తి ముద్దుపెట్టుకొని, తిరిగి ఒడిలోచేర్చి 'భావి భారతవీర' పాటను, జ్ఞాపకమునకు వచ్చినది కాబోలు, చిన్నకూనిరాగముతో ప్రారంభించినది.

జగన్మోహనరావును గూర్చి యిట్టి యాలోచనలు చేయుచున్నందుకు తనలో తనే నవ్వుకొన్నది. తను ఎంతెంత దోషములాతని మెడకు చుట్టుచున్నది. అతనిగూర్చి ఎంత వింతగ నాలోచించినను, నామె తప్పెట్లుండును. ఒక్క పర్యాయమైన అతని గదిలోనికామె నేల రానీయలేదు. తానింట లేనపుడు అతిభద్రముగా తాళము వేసియుంచనేల? తన గదిలోనికి రానీయకపోయినచో వచ్చిన నష్టమేమియో, తన

గదిలోనికే యాతడు వచ్చుచున్నాడుగదా! ఏమిటీ వింతప్రవర్తన! ఎంత యాలోచించినను యంతు కన్పించుటలేదు.

కాని మరునాడు పిల్లవాని పుట్టినదినము, సత్యన్నారాయణ వ్రతముకూడ తలపెట్టినది. అన్ని యేర్పాటులును చేసినది. అతనికీవిషయము చెప్పితీరవలయునుకదా? వ్రతము చేయునో, చేయడో! పీటలపై కూర్చొనునో, లేదో? ఏమైనసరే యీవిషయము వాయిదావేయుటకు వీలులేదు కనుక నేటిరాత్రి తేల వలసియున్నది. అనిర్ణయమునకు వచ్చిన తరువాత హృదయభారము కొంత తగ్గినట్లున్నది, ఇకలేచి పిల్లవానిని ఊయలలో వేయవలెనని యనుకొన్నది. వాడు వేలుచీకుతునే నవ్వుచున్నాడు. ఆమె ఒకచెంప పుణికింది. గడియారం సరిగా పదికొట్టినది. జగన్మోహనరావు యింటిలో అడుగు పెట్టెను.

అతడింట యడుగు పెట్టినాడన్న, సమ్మోహనాస్త్రం వేసెనన్నమాటే. తన కోటుతీసి ఆమె భుజములపై వేసి పడిపోవునేమో యని కాబోలు భుజములవద్ద గట్టిగా నొకసారి నొక్కి, పిల్లవానిని చేతులోనికి తీసుకొని నిటునటు నూప మొదలిడెను. ప్రతిదినము నాతడట్లే చేయును. భారతికి ఏమిఅనుటకు తోచినదికాదు. ఆమెనిశ్చయము చెదరక యున్నను యలసి సొలసియున్న భర్తను, యింటకాలిడగనే నలయింప వలసిన నైజము కాదామెది. అట్టిచో జగన్మోహనుని వద్దనా? అక్షణమునకు 'వాతోద్ధూత శారదాభ్ర శకల చయము వోలె' దృఢనిశ్చయమంతయు మాయమైపోయినది.

'పిల్లవాడు ఒళ్లోనేగాని, ఉయ్యాలలో పడుకోనని నీతో ప్రత్యేకము చెప్పేడుకాబోలు' అని మందహాసం చేయుచు అక్కడ కుర్చిలో కూర్చొనియెను. ఆమెయు అతని కెదురుగావచ్చి నిలచెను.

'నేనెత్తుకున్నాని వాడికేలా తెలిసింది చెప్పూ. నిద్దట్లో కూడా ఎలాగు నవ్వుతున్నాడో చూడు.'

'ఓ, నన్ను చూసినా నవ్వుతాడు. వాడికేం పోయింది' అన్నది వయ్యారముగా వాలుజడ నొక్క విసురు విసిరి.

'నిన్ను చూసీ నవ్వుతున్నాడూ! ఇకనేం నాకొడుకన్న మాటే!'

'అహా! రూపంతా మీరూపే. కాని రేపు గుణా ...' ఉన్నమాట నసిగివేసింది. ఏదో మహా గొప్పమాట అన్నదనుకొని ఒక్క క్షణము సంతోషించినదికూడ.

'గుణానికేం, నీలాగు తయారుచేసేవంటే లోకం బాగుపడిందన్నమాటే' అని మనః పూర్వకముగా నాతడనెను.

'వాడ్ని యిలాగివ్వండి. ఉయ్యాలలో వేస్తాను. మీరు లేచి భోజనానికి తయారవండి.'

'ఉయ్యాల పట్టుకుందూ, నేనే పడేస్తాను.' అంటూ అతడు ఒడిలో నున్న బిడ్డను చేతిలోనికి తీసుకొని ఊయలలో వేసెను. ఆమె కోటుతీసి కొయ్యలకు తగిలించి లోపలకు వెళ్ళగా, నాతడు దుస్తులు మార్చి వీధి తలుపువేసి భోజనపు గదిలోనికి వెళ్ళెను. ఇద్దరును ఒకేసారి భోజనము చేసిరి.

రావు ఆమెగదిలోచేరి 'గృహలక్ష్మి' తీసి కొంతసేపు ఇటునటుత్రిప్పి, తరువాత ఆమె యల్లుచున్న మేజోళ్ల నొకసారి పరీక్షించి, కుట్టుచున్న టేబిలుక్లాత్‌ను, జాకెట్టును ఒకసారిచూసి మూలనున్న టేబిలు దగ్గరకుచేరెను. నాడు ఉతికిన వస్త్రములన్నియు టేబిలుపైనున్నవి. వెంటనే అతడు స్విచ్ వేసి Electric iron తో నాబట్టలను యిస్త్రీచేయుటకు మొదలిడెను. ఇట్లాగ అరగంట అయినవెనుక నామె చెంబుతో నీళ్లు, ఫ్లాస్కు, ఒకచిన్న ట్రేలో అటులు, చెక్కలు పట్టుకొనివచ్చెను. చెంబుతో నీళ్లు తెచ్చుట మామూలే. ఫ్లాస్కులో వేడినీళ్లు పిల్లవానికోసం అదీ మామూలే. కాని అటులు, చెక్కలు తీసుకు రావడం అతనికి చాలా ఆశ్చర్యమును కలుగజేసినవి.

ఆమె వాలుకుర్చీలో కూర్చోగానే అతడును మంచముపైకూర్చుండి "ఈవేళ ఆకులు, వక్కలు తెచ్చావేంటి," అన్నాడు.

"ఏం, వేసుకోకూడదా ?"

నేటికి 3 సంవత్సరములయింది నీధర్మమా అని, ఆకులు, చెక్కలు, సిగరెట్లు మానేసి. మళ్లీ యివెందుకు:

"మీకోసం ప్రత్యేకం తెప్పించలేదులెండి. రేపు సత్యానారాయణ వ్రతంకోసం తెప్పించాను. అందుకని తీసుకొచ్చాను."

ఆనాడు నీమాటమీద మానేశాను. ఈనాడు మళ్లీ నువ్వువేసుకోమంటే వేసుకుంటాను ; కాని యింతకూ సత్యన్నారాయణ వ్రతమేంటి ? నాతో చెప్పనేలేదే !

ఆమెకు యేమనుటకు తోచలేదు. తనమాటయందంత శ్రద్ధయున్నచో యీ మూడేళ్లనుండి యింత అనాదరణేల ?

"దానిమాటే యిప్పుడుచెప్పుదాం అనుకుంటున్నాను, రేపు పిల్లవాడి పుట్టినదినము, వ్రతంకూడా తలపెట్టేను."

'మరి చిన్నసంసార్లు యిలాంటి వేడుకలు చాలాతగ్గించాలని, వ్రతములు మొదలైనవికూడ యెంతో క్లుప్తమగు ఖర్చుతో చెయ్యాలని, ఆకులు, చెక్కలు, మొదలగుచిన్న విషయాలలోకూడా జాగ్రత్తగా ఉండాలని, Avoidable expenditure అన్నదుంటే వీలైనంతవరకు మానుకోవాలని యెప్పుడూ ఉపన్యాసాలు దంచేస్తూఉంటావుకదా మరియిప్పుడీవ్రతమేంటి. ఈవ్రతం చేస్తేగాని మనసంసారరథం ముందుకు నడవదుకాబోలు.'

ఈనాటిరాత్రి భర్తను ఎన్నెన్నోమాటలని అతనివిషయం తేల్చివేయాలని నిశ్చయించుకుంది. అతడిమాటలకు నప్పటికామె కేమనుటకు తోచలేదు. ఆమె తప్పుచేయుచున్నట్లుగా భావించినది. అతడన్న మాటలలో సత్యమున్నదేమోనని యనిపించినది. దైవకార్యముల విషయములలోగూడ నాతడట్లనునని యామె యనుకొనలేదు. ఆమె ఒకవిధముగా తప్పేచేయుచున్నానేమోనను భ్రాంతిలో పడినది.

'పిల్లవాడి పుట్టినదినానికి మాఅన్నయ్య పదిరూపాయిలు పంపితే అదిపెట్టి వ్రతం చేస్తున్నానండీ' అని మెల్లగానన్నది.

'రవికోసం పంపినపదిరూపాయలు, వ్రతానికి ఖర్చుచేస్తున్నావా? వాడు పుట్టినదగ్గరనుండీ ముచ్చటగా వాడికోసం ఏమైనకొన్నావా ?'

అమె యేమీమాట్లాడలేదు. చాల చిన్నపుచ్చుకున్నట్లుంది. ఆమె తలవాల్చుకొని యుండుటచూసి సరే ఆపదిరూపాయిలు వాడిక్రింద ఖర్చుచెయ్యి. నా పుట్టినదినంకూడా రేపే. వ్రతంఖర్చు నేను పెట్టుకుంటాను, అని అతడు నవ్వుతూ, మెల్లగా, చిన్నకోపం అభినయింపుచున్నాడు.

ఆమాట అనేటప్పటికి తేరుకుందికాని అతడు అన్నమాటలు అంతగా అర్థముకాలేదు. 'మీపుట్టిన దినం ఆగష్టులోకదా రేపుఅంటారేమిటండీ. అయినా మీకుమాత్రం డబ్బుఎక్కడిది ? జీతంఅంతా నాకే యిస్తున్నారుకదా ;' దీనితో నిజానిజములుకూడ తేలిపోవునని యామె భావించెను.

'నీవు ఆనాడు లంచాలుతిని లక్షాధికారిలాగు ఉండటానికి ప్రయత్నం చేసేకంటే, స్వయంకృషి వల్ల సామాన్యుడుగా ఉండడం మంచిదన్నావే ఆనాడుచచ్చి తిరిగి యీనాడు పుట్టేను. అందుకని నాపుట్టినదినం రేపుచెయ్యి' అన్నాడు. అతడు నవ్వుచునేయున్నాడు. కాని ఆమెకేమియు నర్థముకాక ఆశ్చర్యముగా చూచుచున్నది.

'ఈ మూడు సంవత్సరములు నేను చేసినపని చెప్తానువిను. ప్రొద్దున్న 7 గం|| నుండి 9 గం|| వరకు ఇద్దరు కుర్రవాళ్లకు, సాయంత్రం 5 గం|| నుండి 6 గం|| వరకు మరి యిద్దరికి ట్యూషను చెప్పుకొని నెలకు రు 50 - సంపాదించాను. ఈ రు 50 - Devar's College of Commerce లో కట్టి సాయంత్రం 7 గం|| నుండి 9 గం|| వరకు అక్కడ C. A. I. I. B. పరీక్షకు చదువుకున్నాను. ఈ చదువుసంగతి నీకు తెల్యకుండా ఉండాలనే, నాగదిలోనికికూడా నిన్ను రానీయలేదు. నాపరీక్షలు రెండునెలలక్రిందటే అయిపోయాయి. కాని ట్యూషను కుర్రవాళ్ల పరీక్షలు దగ్గరకువచ్చుటచే వారిపట్ల యింకను శ్రద్ధవహించి రాత్రి 7 గం|| నుంచి 9 గం|| వరకుకూడ వారితోనే గడిపితిని. యీ బొంబాయిలో పాపం మనతెలుగు వాళ్లకు సరియైన పాఠశాలలులేవు. వారునాకు జీతము ఎక్కువ యివ్వకపోయినా మనతెలుగు వాళ్లేకదా అని నేను చదువుకోడానికి వీలుగ నాచే ట్యూషన్లు చెప్పించుకున్నారుకదా అని కొంచెం కష్టపడి చెప్పేను. ఆకుర్రవాళ్ల పరీక్షలు రేపటితోసరి. నేనుచెప్పవలసిన పాఠాలు యివేళతోసరి. యీ నెల జీతాలు వాళ్లందరు యిచ్చేశారు. నా పరీక్షా ఫలితాలుకూడా రెండురోజులక్రితమే తెలిశాయి. నా పరీక్ష ప్యాసయింది. మామేనేజరు ఒకటవతేదీనుండి ప్రమోషను యిస్తానని వాగ్దానం చేసేడు.

అదుగో జేబులో రు 50 - ఉన్నాయి తీసుకొని వ్రతంచేసి, మిగిలింది నీయిష్టమువచ్చినట్లు ఖర్చుచెయ్యి.

ఆమె ఆశ్చర్యమునకు మేరలేదు. సంతోషమునకు పరిమితిలేదు. ఆమె చెంగునలేచి తనపెట్టితీసి, 'ఇదిగో యీ పంచలచాపు. యిది మీరు రేపు కట్టుకోవాలి' యని యనుచు దగ్గరకుచేరెను. పంచలచాపు చూపించుట యంత ముఖ్యమనికాదు, ఆమె కేమిచేయుటకును, తోచక అట్లొనర్చినది. ఆమె చెంతకు చేరగనే రావు యీయవలసిన బహుమానము వెంటనే యిచ్చెను.

అతడు మేడమీదికివెళ్ళి (మూడేండ్లక్రిందటకొన్న) ఒక చీరను తీసుకొనివచ్చి, 'ఈ చీరనీవు తప్పకుండా రేపు కట్టుకోవాలి. ఆనాడు నేనది కొనకుండా ఉంటే నేడు యీవిధముగా మార్చువచ్చెడిది కాదు.'

'పాపాయిని తీసుకొని మేడమీదికిరా' అని చెప్పి రావు మేడగదిలోనికి వెళ్ళెను.

మరునాటి ఉదయంవరకు చీర, చాపు ఒక్కచోటే ఉండిపోయాయి.




సాంధ్యకన్యక కౌగిలి - సరసరతుల తరణి యలరారుచుండెడి - తరుణమందు
సారసాప్తుని విరహంబు - సైపలేక కమలకన్యయు - ముకుళించె - కనులనంత.

రజనికన్యక విరహాను రాగలహరి తన మనోకాంతు రాకకై - తత్తరపాటు
చతుర సంగీతగరిమ - చకోరసంతు చంద్రు రాకను దెల్పెనా - చంద్రముఖికి.

విరియగాచెడి వెన్నెలవీధియందు కదలుచుండెడి కనుచూపు - కవళికలలు
మెరయుచుండెడి తారల మినుకులందు రాజ్యమేలుచునుండెనా - రజనికాంత.

సాంద్రశీతల చంద్రికా సౌష్ఠవమున విమలమైనట్టి వెన్నెల వీధియందు
విశ్వసుందరి యుత్సవ వేడ్కలలర రమ్యకాంతులతోడను - రమణమీరె.

అట్టి వెన్నెలరేయిని యతివయొకతె విమలయమునా నదీతీర వేదికపయి
చెక్కిలిని చేయిజేర్చియు చింతతోడ వికసితాంభోజన నేత్రియై విరహమొప్ప.

ఏలనీవేళ వేణుగోపాలు మురళి గాన మకరంద బిందుసంగీత రవళి
వీనులకు విందొనర్పదు? వెన్నుడేల రాకయున్నాడు నావంక రహిదొలంగి?

అమృతలతికల యాలింగనంబు వాసి విమల యమునానదీ గర్భ వారికణముల,
గదిసి ముద్దిడుకొనుచున్న గంధవహుడ! గాంచితే? నీదుత్రోవను కంజనేత్రు.

మదనగోపాల నాయొక్క మనమునందు నీదురాకను గోరుచు నిరతితోడ
వేచియున్నాను రాధిక! వీసమంత దయయు ప్రేమయు లేదుగా దలచిచూడ!

రమ్యశీతల చంద్రికా రాత్రులందు వేడ్క యమునానదీతీర వనులయందు
విరియబూచిన మల్లికావనులలోన గలసి క్రీడించిన దినాలుగలవా? స్మరితిని.

యర్రమల్లి చలపతిరావు.

# సినిమా రంగము



రత్నమాల, లైలామజ్ను చిత్రాల నిర్మాతలగు భరణి పిక్చర్సువారు "Love" (ప్రేమ) అనే చిత్రనిర్మాణమునకు పూనుకొన్నారు. ఈ కథ చాల రసవత్తరంగాను, మనోహరంగాను తెలుగు అరవభాషలలో తయారగుతున్నది. స్టూడియో వాహినీ; డైరెక్టరు శ్రీ రామకృష్ణ. ఇందు శ్రీమతి భానుమతి నటిస్తున్నది. శ్రీ కమల్ ఘోష్, సుబ్బరామన్ గార్లు ఫొటోగ్రఫీ, సంగీత దర్శకత్వములను నిర్వహిస్తున్నారు.

◆ ◆ ◆

టి. కె. ప్రొడక్షన్ వారి "పాలేరు" అనే సాంఘిక చిత్రాన్ని తీయడానికి పూనుకొన్నారు. చిత్రపు ప్రారంభోత్సవ సందర్భమున మద్రాసు కార్పొరేషను కమీషనరు శ్రీ సి. నరసింహంగారు చిత్రనిర్మాణం జయప్రదంగా సాగాలని ఆశీర్వదిస్తూ యీ చిత్రపు కథావస్తువు వ్యవసాయపు సమస్యలను సమగ్రంగా పరిష్కరించడానికి ఉపకరించాలని కోరారు. డైరెక్షను గోపీచంద్. ఇది టి. కె. ప్రొడక్షన్సు అండ్ శోభనాచల జాయింటు ప్రొడక్షను.

> చలన చిత్రాలకు సంబంధించిన వార్తలను, సమీక్షలను, విమర్శలను మేము ప్రచురింప దలచాము. మా పాఠకులు, చిత్రనిర్మాతలు మాతో సహకరించి వ్యాసములను, వార్తలను పంపెదరని ఆశించుచున్నాము.
>
> ఇట్లు
>
> సంపాదకుడు

◆ ◆ ◆

వాహినీ పిక్చర్సువారి "మల్లేశ్వరి" చిత్రము శ్రీ బి. యన్. రెడ్డిగారి దర్శకత్వము క్రింద తయారగుతున్నది. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి రచన, రాజేశ్వరావు సంగీతం చిత్రానికి ప్రత్యేక ఆకర్షణలు. యన్. టి. రామారావు, భానుమతి, శివరావు మొదలైనవారు నటిస్తున్నారు.

◆ ◆ ◆

గోవల కృష్ణా పిలిమ్సువారు "ప్రియురాలు" అనే సాంఘిక చిత్రాన్ని తీస్తున్నారు. గోపీచంద్ దర్శకత్వం. కృష్ణకుమారి, రేలంగి, లక్ష్మీకాంతం, కనకం మొదలగువారు నటిస్తున్నారు.

◆ ◆ ◆

"కమ్మరి మొల్ల" అనే చరిత్రాత్మక చిత్రాన్ని శ్రీ చిత్తూరు నాగయ్యగారి దర్శకత్వము క్రింద తీయడానికి ఏర్పాట్లు జరుగుచున్నవి.

---



---

# ఆంధ్రదేశపు జానపద గేయాలు

సేకరణ, నిర్వహణ:

శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావుగారు.

తేతబూరుగు చెట్టు పచ్చని బోదెతో ఎంతో ఆకర్షకంగా ఉంటుంది. వసంతకాల సమీపంలో ఆకులను రాల్చివేస్తుంది. చెట్టుకి ఖచ్చితంగా అడ్డంగా పెరిగే కొమ్మలనుంచి వేలాడే కాయలను చూస్తే కొమ్మలనుంచి సొగసుగా చిలుకలు వేలాడుతున్నాయా అనిపిస్తుంది. ఇప్పుడు పాడే పాటలో జానపదకవి బూరుగుచెట్టు అందాన్ని, ఆకాయలని చూసి చిలకలుపడే అవస్థను వర్ణిస్తాడు. కవి అంతటితో ఊరుకోలేదు. ఈసందర్భంలో బాలెంత సొగసుని ధ్వనిగా చిత్రిస్తాడు. నిరాశపడ్డ చిలకలు బాలెంతని చూసి తమ కోర్కె తీరుతుందని భ్రమచెందుతాయి. ఇంతవరకూ చాటునున్న కవి ముందుకువచ్చి చిలకలకి వాటి పొరపాటుని తెలియజెప్పబోతాడు.

వేసవికాలాన పూసు బూరగలు
ఆసపడి చిలుకలు ఆరునెలలుండు
పూవు పూసిందాక పూగొమ్మనుండు
కాయకాసిందాక కడ గొమ్మనుండు
పండు పండిందాక పలవలోనుండు
పండిన ఆపండు దూదయి పోయె
దూది చూచి చిలుకలు దుఃఖపడ్డాయి
పసుపురాసి బాలెంత బయటనిలుచుంటె
పండని చిలుకలు పైనవాలేయి
కాయని చిలకలు కొరాడినవి
పండుగాదు చిలకలార! పచ్చి బాలెంత
కాయగాదు చిలుకలార! కొముని తల్లి.

ప్రాచీనాంధ్రదేశంలో నాగజాతివారు ఉండేవారు. నాగము దేవతాస్థానము ఆక్రమించుకొంది. నాగప్రతిమలు రాతితోచెక్కినవి ఎక్కడపడితే అక్కడ కనబడుతుంటాయి. నాగులచవితి, సుబ్బారాయుడి షష్టి మనకి పండుగలు. ఇన్నివిధాల నాగుపాము మనకి భయోత్పాతాలతోబాటు గౌరవ పాత్రమయింది. ఈ దిగువ జానపదగేయంలో కవి నాగుపాముఎడ తనకిగల అనుకంపని తెలియజేస్తాడు.

పుట్టలోనాగన్న బూచి నాగన్న!
ఎండలోపడుకోకు వెర్రినాగన్న!

1. కలిగినవారికోడళ్లు గర్వవంతులు
కలాపిజల్లేరు కాళ్ల జిమ్మేరు
ఎంగిళ్లుజల్లేరు భంగపుచ్చేరు ॥పుట్ట॥

2. అటువెళ్లకు నాగన్న చాకిరేవులకు
చాకిరేవులలోను చేరి పడుకుంటె
సాలిపరుగుడని చంపేరునాగు ॥పుట్ట॥

3. అటువెళ్లకునాగన్న చెరుకువనములకు
చెరకువనములలోన చేరిపడుకుంటె
నల్లచెరకుఅని నరికేరు నాగు. ॥పుట్ట॥

ఇప్పుడు పాడబోయే దొక జానపద ప్రేమగేయం. ప్రేయసుడు లలితమైన భావాలను వెలిబుచ్చేడు. చంద్ర బింబాన్ని 'వెండికట్ల కిన్నెర' అన్నాడు. వసంతకాలంలో ప్రకృతియొక్క శోభని పేర్కొన్నాడు. ప్రేమోద్వేగాన్ని తెలుపుడు చేసుకొంటున్నా ప్రేమకి ఆలోచనలేని లోపానికి నొచ్చుగో పోక పోలేదు.

వేళజూడ వెన్నెలాయె, వెండికట్ల కిన్నె
రాయె, మల్లెపూల పందిరాయె
వయ్యారిరావె, నవ్వులోనె తెల్లవారును ॥
కొండగోగులు పూసెనేమొ, కొండ
నిమ్మలు కాసెనేమొ, దొండపండులాంటి పెదిమె
వయ్యారిరావె, మనసు ఎవరిపాలు జేతును ॥
మల్లెపూవులు పూసినట్లు, మళ్లి మళ్లి
మాటలాడు, మల్లెపూలవంటి మనసు
వయ్యారిరావె, పూవులెవరిపాల జేతును ॥
కందిపూసె, కందిగాసె, కందికొసలు
నందిమేసె, అందమైన మేలినడల,
వయ్యారిరావె, గంధమైన పంపనైతిని.

ఇప్పుడు పాడబోయే ప్రేమగేయం చెంచు, చెంచెతల సంభాషణ. దీనిలో అడివి పరిసరాలు వర్ణించబడ్డాయి. అడివిలో వారి స్వేచ్ఛా జీవనం ప్రతిబింబిస్తూంది.

చెంచు:- లేడి కన్నులదాన! వాడి సూపులదాన!
ఏడ పోయేవెసాన? ఇక్కాన, ఏడ పోయేవెసాన!

చెంచెత:- నూగుమీసాలవాడ! తీరైన యందకాడ
ఊరేమి సెప్పరార, నీపేరేమి వన్నెకాడ!

చెంచు:- నా పేరు సిన్నమల్లు, నా ఊరు ఉంగుటూరు.
సయ్యాటలాడదాంరా! ఓ చెంచెతా! సయ్యాటలాడదాంరా!

చెంచెత:- అల్ల నేరేడికాయ, నల్లని మేనిశాయ
సయ్యాట లాడలేనురా! ఓ చెంచు! ఒక్కా-దాన నడవిలోన.

వ్యవసాయ దారులకి నూర్పులకాలం చాల సంతోషసమయం. ఏడాదిపొడుగున పడ్డశ్రమకి ఇప్పుడు వచ్చేగింజలే ఫలితం. కాని ఈసమయంలో కూడ అనేక ఆదుర్దాలు లేకపోలేదు. నూర్పైన గింజలు గాదిలో చేరేదాకా రైతుకి ఆదుర్దాయే! కనుక దేవుని సహాయం అన్నిఘట్టాలలోను అవసరమే. ఇప్పుడు పాడే పొలిపదంలో రైతుయొక్క దైవప్రార్థన, పాడిపంటలూ, సీతారాముల మధుర స్మృతి గోచరిస్తాయి.

పొ లి ప ద ము

పొలి పొలో, వెయ్యేల పొలిగలుగు ॥పొలి॥
ఊళ్లోవినాయకా! విఘ్నేశ్వరుండా ॥పొలి॥
విఘ్నములుగాకుండ విఘ్నేశ్వరుండా ॥పొలి॥
పొద్దున్నపితికేరు బొల్లావుపాలు ॥పొలి॥
ఎండెక్కి పితికేరు బొంతావుపాలు ॥పొలి॥
సందెవేళ పితికేరు జమ్మావుపాలు ॥పొలి॥
గడియకు పితికేరు గంగగోవుపాలు ॥పొలి॥
మాచేను మరుదల జువ్వి లేగలవు? ॥పొలి॥
జువ్వెక్కి మారాము రాగాలుతీసె ॥పొలి॥
మాచేను మొగదల రావిచెట్లు గలవు ॥పొలి॥
రావెక్కి మాసీత రాగాలుతీసె ॥పొలి॥

ఈ కింది జానపదగేయంలోని వస్తువు సదా రైతాంగంలోని ఆలుమగళ్ల కయ్యం; కొత్తకాపరమని కూడ చెప్పవచ్చు. భార్య కొంత పెడసరపు కట్టె! మగవాడు ఐకమత్యంకోసం తంటాలు పడతాడు. ఒకరి లోపాలను ఒకరు ఎత్తి చూపించుకొంటారు. రెండు పక్షాలలోని అంశాలను కలిపిచూస్తేనేగాని మొత్తపుస్థితి గోచరంకాదు. ఈ గేయమంతా సంభాషణ. దీనిలో జానపద గృహ్యజీవితం వివరంగా ప్రతిబింబిస్తుంది.

భార్య:- కోడికుయ్యగలేచి కోడేను వడ్లన్నీ
కూడువండి వంకాయ కూరతో నువ్వుదినగ
మూలనున్న పెరుగు ముంతను కడిగేసి,
మాడుచెక్కల పణ్ణమునకైన గతిలేదె

వేరుపడితే మేలుగా! నాధా!
కూడి ఉంటే పోరుగా!

భర్త:- కూరలోను ఉప్పు మనసొప్పలేదంటి
నోరు చవిచచ్చింది నోములాఫలమేమొ
వేరుపడితే ఏలాగే! ఇల్లాల!
మనకు కోపము లేదాయెనే!

భార్య:- వేకువ జామున సేరు ఏకులు వడకంగ
కాకులుకూయంగ గడపచిమ్మి అలికి
నీకూ నిమ్మలబావినీళ్లు తెచ్చినేను
ఆకుకంచంలో అతివేగతివిపిస్తి
వేరుపడితే మేలుగా! నాధా!
కూడిఉంటే పోరుగా.

భర్త:- ఏమి ఇల్లాలివే ఎప్పుడూపోరాటే
వేలిమీద గోరుడితే వేరుంట నంటావు
వేరుపడితే ఎలాగే ఇల్లాల!
మనకేమి లేదాయనే

భార్య:- గిద్దె పెసరపప్పు గిన్నెతో నేవండ
వద్దువద్దంటునే వడ్డించుకొన్నావు
ముద్దచేసి కొంత మూలనేదాచుంచి
పొద్దుటన్నంలోకి పొలములోకంపిస్తై
వేరుపడితే మేలుగా! నాధా!
కూడిఉంటే పోరుగా!

భర్త:- కోకలకమ్మించేవు, గోచిపెట్టించేవు
కొంపలోచేరేక గొల్లుమనిపించేవు
వేరుపడితే ఏలాగే ఇల్లాల!
మనకేమి లేదాయనే!

———(:o:)———

# ఆదర్శమిథునం

శ్రీ చీమలపాటి
సూర్యనారాయణరావుగారు

(గత సంచిక తరువాయి)

అంది కోపంగా నేను మౌనంగానే వున్నాను.

"ఎందుకు కొడుతూ వుంటాడు?" మా అత్తకు వాళ్ళ సంసారం గురించి తెలియకపోవటంచేత, ప్రశ్నించింది.

"ఎందుకంటే, యేమిటని చెప్పమంటావ్? జగదాంబ మీద వాడికి పుట్టెడనుమానం! వీధిలోకెళితే అనుమానం - వొకరితో సద్భావంతో మాట్లాడితే అనుమానం! ఆ యనుమానమును మనసులో పెట్టుగుని నిత్యమూ, దానిని యెద్దును బాదినట్లు బాదుతూ వుంటాడు."

"ఎంత చదువుకుంటే యేం ప్రయోజనం అమ్మా; వివేకం లేనప్పుడు! వాడుకొట్టే దెబ్బలకు ఆపిల్ల భరాయించింది కానీ - నావంటిదైతే యీ పాటికీ చచ్చి పూరుకుంటుంది. వాళ్ళ సంసారాన్ని జూస్తూంటే యెలాంటి వాళ్ళకైనా విచారాన్ని కలిగించక మానదు! మగవారిలో పశువులుమల్లే ప్రవర్తించే వాళ్లు, కఠినీకృత హృదయులూ వుంటారా? అని వొక్కొక్కప్పుడు అనుకుంటూ వుంటాను. ఎంతలేసి చదువులుచదివినా మగవాళ్ళ స్వభావమే అంత!" అంది: మగజాతిపై గల తనకోపాన్నంతా వెడలుగ్రక్కుతూ. మాయావిడ మాటకు నేనడ్డువచ్చి -

"మగవారిలో గండ మూర్ఖులూ వున్నారు; మంచివారూ వున్నారు. సముద్రప్రవాహంలో (బ్రహ్మసృష్టిలో!) కేవలం మణి మాణిక్యములే కొట్టుకొని రావుగదా, వాటితోపాటు రాళ్లూ, రప్పాను" అన్నాను.

కొంతకాలం మాయిద్దరిమధ్యా మౌనం గడిచింది ...

"ఆ - మన యింటికెదురుగావున్న సావిత్రి మన కడ్డెడు బియ్యం ఇవ్వాలి అడిగి పుచ్చుకున్నారా?" అంది:

కాలగర్భంలో కలిసిపోయిందనుకున్న "అల్లావుద్దీన్ లాంతర్న" బయటకుదీసి తుప్పుదులప సాగింది. నాకు గుండెలు గుభేలు మన్నాయ్; ఇటువంటి చిల్లర మల్లర అప్పులను అప్పుడే మరిచిపోయాను. సావిత్రియెవరో నాకుదెల్సు; అపిల్లకు మాయావిడప్పిచ్చినట్లు నాకుదెల్సు. కానీ నేను "ఓం! ఆపిల్లా?" అని ఆతృతతో అన్నానా - లేనిపోని సంబంధాలు మాయిద్దరికి అంటకట్టి, నాతో మాట్లాడక, సత్యాగ్రహంజేసి (మళ్ళా మా ఆవిడకు ప్రూఫ్ దొరికే వరకు!) వంటలో కంగాళి జేస్తూంది. భైరవశాస్త్రిమల్లే దానిని కొట్టలేను, తిట్టలేను. కాంతాన్ని తిట్టేందుకు కొట్టేందుకు: నాకు నోరు, చేతులురావు. యీ అనుమానమును కడుపులో పెట్టుగుని, సంసారంలో తుపానులను, వరదలను సృష్టిస్తూంది. అందుకు మనకు తెలియనట్లు నటిస్తే యేబాధా వుండదని.

"ఏసావిత్రి?" అని తెలియనట్లు ప్రశ్నించాను.

“సావిత్రినే యెరుగరా? పెళ్ళికాని పిల్లండి! మాటి మాటికీ పెరట్లోకి వచ్చి అందరివైపు ఆశగా జూస్తూంటుంది. దానిమీద ఆటవెలది పద్యం వ్రాసి రెండునెలల క్రితం మనింటి కెదురుగా నున్న గోడను అంటించారు, ఆపిల్లండి?” అంది.

“ఏమో నాకంతగా జ్ఞాపకం లేదు. నువ్వాపిల్లకు బియ్యం అప్పిచ్చావని నాకేం దెలుసు? అప్పిచ్చిన వాళ్లు అడుగుతే బాగుంటుందిగాని, నేనడుగుతే బాగుంటుందా? అదీగక - అదీగాక ఆడవాళ్ళతో మాట్లాడ్డమంటే నాకు పూరంత సిగ్గుసుమా!” అన్నాను.

“అడగటం మానేశారా? యిట్లాగే సంసారాలు చెడిపోవటం!... యిచ్చిన వస్తువును తిరిగి అడిగి పుచ్చుకోరటండీ?” అంది. ముందుగానే మీతో మనవి చేశాను. అల్లావుద్దీన్ లాంతరుకు తుప్పు దులుపుతూందని.

“ఇంతకీ - ‘సావిత్రి’ మీదెవరో పద్యాన్ని వ్రాశారన్నావు; ఆపద్యమేమిటో నీకు జ్ఞాపకముందా?” అన్నాను.

“అయ్యో! జ్ఞాపకం లేకేమి: (అంటూ)

“పెండ్లికానిపిల్ల ప్రతివేళల దిరుగు
పెరటి నందె: యింటి పట్టుఁ లేక;
పెద్దవయసు పడతికి ప్రమాదమేనయా,
తిట్టగాను నేను తిట్టకండి!”

విరగబడి చదివింది. నాకూ నవ్వు ఆగిందికాదు.

“ఎవరు వ్రాశారో కాని బలేగా వ్రాశారు, బహుశా కొంటె విద్యార్థులే వ్రాసుండాలి. గణాలు సరిపోయేవో లేవో తెలీదు; కానీ శైలికొంచెం బాగుంది!”

“కాంతం - పన్నెండైంది, ఇకపడుకోండి!” అంటూ మా అత్త కూకలేయటంచేత, మా యావిడ దీపం ఆర్పి పక్కవేపు పయనమైంది. నేను చేయునదిలేక నామంచమీద పడుకొని కళ్లుమూసాను. నాయెదుటి మంచంమీద మాయావిడ పడుకుంది.

నాకు తెలివి యెలాగ వొచ్చిందో తెలీదుగాని, తెలివిరాగానే గువ్వపిట్టల్లే వొదిగి నాప్రక్కలో పడుకొని, కిటికీలోంచి గదిలోకి దూకిన చల్లటి వెన్నెలలో తళతళమని మెరిసిపోతూన్న మాయావిడని జూచి మురిసిపోయా.

దూరాన - మంద మారుతం యొక్క మందస్వరమునకు, నది పరవశమొంది కెరటములను పుబక వేసి, నృత్యమాడిస్తోంది ... చెట్ల ఝుళం ఝుళీరావములు, అలసి అగి ఆగి పాడుతూన్న పక్షుల వృద్ధపదాలు: నాలోని కమ్మని పాటలను నారుబోసి, నీరుబోసి, యేదో చెప్పరాని బాధను నాలో కలిగిస్తూంది.

(సశేషము)



# లోక వార్తలు



అమెరికా, ఈజిప్టు ప్రత్తి ధరలు తగ్గిన కారణం చేత ఫైన్ రకాల గుడ్డల ధరలు షుమారు 100 కి 1¼ ను, సూపర్ ఫైన్ రకాల గుడ్డల ధరలు 100 కి 14 వరకు తగ్గవచ్చును. మతక, మధ్యరకాలకు ధరలు తగ్గవట. ఈ విషయమై త్వరలో ప్రభుత్వ ప్రకటన వెలువడగలదు.

◆ ◆ ◆

1953 సంవత్సరము నాటికి అమెరికా ఏడాదికి 50 వేల విమానములను నిర్మిస్తుందట. ఇది అమెరికా రక్షణ సన్నాహ కార్యక్రమంలో నొక భాగమట.

◆ ◆ ◆

భారత దేశమునకు అంతర్జాతీయ బ్యాంకు 7 కోట్ల 85 లక్షల డాలర్లను అప్పుగా యిచ్చింది. ఈ సైకం తీసివేసిన రైల్వేలైనులను పునర్నిర్మించుకొనుటకు, విద్యుచ్ఛక్తి ఉత్పత్తి స్కీముల కొరకు, వ్యవసాయమున కుపకరించు యంత్రములను కొనుటకు, ప్రాజెక్టులను నిర్మించుటకు.

◆ ◆ ◆

రామకృష్ణ మఠానికీ, మిషన్ కీ అధ్యక్షుడుగా శ్రీ స్వామి శంకరానందమహరాజ్ ను ఎన్నుకొన్నారు. వీరివయస్సు 70 సం॥లు. వీరికిముందు క్రిందటి నెలలో మరణించిన శ్రీ విరజానందగారు అధ్యక్షులుగా నుండిరి.

◆ ◆ ◆

ఒరిస్సాయందలి కాలాహాండీ జిల్లాలో మాంగనీసు గనులున్నట్లు భూగర్భ పరిశోధన శాఖవారి పరిశోధనవల్ల తెలుస్తున్నది.

బొంబాయి పారిశ్రామిక ప్రాంతములో రాష్ట్రీయ సహకార వ్యవస్థవారు కార్మికులకు ప్రత్యేకంగా బ్యాంకును నెలకొల్ప ప్రయత్నిస్తున్నారు. మనదేశంలో యిట్టి ప్రయత్నము జరగడము యిదే ప్రథమం.



జూన్ నెల 15 వ తేదిన జరిగిన అఖిల హైదరాబాదు కాంగ్రెసు సంఘ సమావేశములో యీ సంఘం భారత జాతీయ కాంగ్రెసుతో కలిసిపోవడానికి ఏకగ్రీవంగా తీర్మానించింది.



వాణిజ్య పంటలు పండే భూములకు భూమిసిస్తును పెంచుటను గురించి మద్రాసు ప్రభుత్వము వారు యోచించుచున్నారట.



కమ్యూనల్ జి. ఒ. స్థానే మద్రాసు ప్రభుత్వము వారు చేసిన క్రొత్త ఏర్పాట్ల ననుసరించి వృత్తికళాశాలలయందు 100కి 15 స్థానములు హరిజనులకు, 25 స్థానములు వెనుకబడిన తరగతులకు ప్రత్యేకించినట్లు తెలుస్తున్నది. ఇదిగాక 15 లేదా 20 సీట్లు ప్రభుత్వోద్యోగులకు, రాజకీయ బాధితుల బిడ్డలకు యిచ్చుటకని ప్రభుత్వము వారే రిజర్వులో నుంచుకొనియున్నారు. మిగిలిన స్థానములను ఇంటర్మీడియెటు పరీక్షలో 45% మార్కులకు తగ్గకుండా వచ్చిన వారికట.



భారత నౌకాశాఖలో యిదివరకున్న దళములకు తోడుగా మందుగనులను ఊడ్చిపారేసే నౌకాదళము నిర్మించుటకు ప్రభుత్వం సంకల్పించుకొన్నది. ఇది నౌకాశాఖను సర్వాంగ సమన్వితంగా అభివృద్ధి చేసుకొనుటకు ప్రభుత్వముచేసిన కార్యక్రమములలో ఒక ప్రధానమైన భాగంగా నుద్దేశించబడింది.

♦ ♦ ♦

తూర్పుపంజాబ్ ముఖ్యమంత్రి డా. గోపీచంద్ భార్గవా కాంగ్రెస్ కేంద్ర పార్లమెంటరీ బోర్డు వారి ఆదేశానుసారం తమ ముఖ్యమంత్రి పదవికి రాజీనామా నిచ్చారు. శ్రీభీమసేన్ సచార్, సర్దార్ ప్రతాప్ సింగ్ కైరానుగార్లను మంత్రివర్గ నిర్మాణముచేయ నిరాకరించుటచే తూర్పుపంజాబులో గవర్నరు పరిపాలన ఏర్పడగలదు.

♦ ♦ ♦

కేంద్ర ప్రభుత్వము బియ్యము, గోధుముల ధరలు పెంచిన ఫలితంగా మనరాష్ట్రంలోని రేషను దుకాణములలో బియ్యం ధర పడి 1కి, షుమారు 0.0.6 ను, గోధుమ ధర పడి 1కి, షుమారు 0.1.3 పెంచవలసి వస్తుంది.

♦ ♦ ♦

రాయలసీమ జిల్లాలలో జరిగిన అదనపుపంట పోటీలో ఎకరమునకు 54 బస్తాలవడ్లు పండించిన బండ్లపల్లెరైతు సాంబయ్యకు అనంతపురంలో జరిగిన వనమహోత్సవపు సందర్భమున బంగారు పతకమును, రెండువందల రూపాయలు బహుమానమివ్వబడెను.

♦ ♦ ♦

అఖిలభారత జాతీయ కాంగ్రెస్ కార్యదర్శి హైదరాబాదులో నొక గోష్ఠిలో భాషారాష్ట్రిలు ఏర్పడి తీరాలనియు, అవి ఏర్పడినప్పుడు భాషా ప్రయుక్తంగా హైదరాబాదును విభజించక తప్పదని వెల్లడించిరి.

♦ ♦ ♦

జూలై 1.వ తేదినుండి అదనంగా లభిస్తున్న ధాన్యాలను తీసికోకూడదని రత్నగిరియందలి ప్రముఖ పౌరులు, నగర రేషను కమిటీ సభ్యులు నిర్ణయించుకొన్నారట. ఈ విధంగా మిగిల్చిన ధాన్యాన్ని బీహారు కాటక ప్రదేశాలకు సప్లయిచేయ నిశ్చయించుకొన్నారట.

♦ ♦ ♦

ఆచార్యరంగా తన వర్గంతో మరల కాంగ్రెస్‌లో చేరినను తామిదివరకుచేసిన రాజీమార్గము అమలులోనికి రాదనియు, అది రద్దయి చాలకాల మయిందని ఆంధ్రప్రదేశ కాంగ్రెస్ ప్రెసిడెంటు శ్రీ నీలం సంజీవరెడ్డిగారు ప్రకటించారు.

♦ ♦ ♦

అఖిలభారత రైల్వేపని వారి సమాఖ్య ఆగస్టు నెలలో జరుపడానికి నిశ్చయించిన సమ్మె అక్రమమని ప్రకటిస్తూ ఒక ఆర్డినెన్సు జారీ చేయబడినది.



బెనారస్‌కు 20 మైళ్ల దూరముననున్న ఒకపల్లెలో ఒక పెళ్లియూరేగింపు సందర్భమున ఒక ఏనుగు మరొక ఏనుగు పైనున్న మావటీని చేతిలోని బల్లెమునుచూచి క్రోధావేశముతో అతనిని క్రింద పడవేసి కాళ్లతో మర్దించి చంపిందట. ఆ ఏనుగుకు క్రిందటి సంవత్సరము పిచ్చెత్తిపోగా దానిని వళ్లంతా బల్లెములతో గ్రుచ్చి మావటివాళ్లు స్వాధీనములోనికి తెచ్చుకొన్నారట. అప్పటినుండి ఆ ఏనుగుకు బల్లెం అంటే సింహస్వప్నముగా పరిణమించింది.

♦ ♦ ♦

గోమయమును పులియబెట్టు పద్ధతి మూలంగా వెలుతురివ్వడానికి, వేడిమికలిగించడానికి, వంటచెరకుగా నుపయోగపడుటకు ఉపకరించు గ్యాసు తయారుచేయవచ్చునని ఉస్మానియా విశ్వ విద్యాలయం తాలూకు వ్యవసాయ శాఖవారు పరిశోధనా ఫలితంగా నిరూపించారు.

♦ ♦ ♦

అమెరికను డాక్టర్లు కాలుటవలన శరీరముమీద ఏర్పడిన వ్రణములను మాన్పుటకు మందు, కట్టు లేకుండా నొకపద్ధతిని కనిపెట్టారు.

వ్రణాలను పొడియైన వెచ్చని గాలిలో తెరచియుంచవలెను. అట్లు చేయుటవలన 24 గంటల కాలంలో చెక్కుకట్టును. కాలుటకు గురియైనవారికి ఉష్ణమును సమకూర్చి ఆరోగ్యమును కాపాడునట్టి మంచి ఆహారమును, వ్రణములపై సాధారణ చర్మము ఏర్పడి తనపని తాను చేసుకొనగలిగే వరకు సమకూర్చుచుండవలెనట.

ఈ చికిత్సకు సూక్ష్మంలో మోక్షమన్నట్లు సులభము మాత్రమేకాక మందుకాని, కట్టుకాని అవసరము లేదు. వ్రణములు శీఘ్రకాలంలో నయమగుతవి.

♦ ♦ ♦

గతప్రపంచ యుద్ధానంతరం నార్వేదేశపు ప్రజల ఆయువు వృద్ధిఅయిందట. అంటే ప్రస్తుతము 15 సంవత్సరములు వెళ్లగానే స్కూలువదలి ఉద్యోగాలలోచేరే ప్రతి 100 మందికి 74 మంది పెన్షను పుచ్చుకొనడానికి 65 సం||లు. జీవించియుంటారట. యుద్ధానికిముందు ప్రతినూరుమందికి 69 మంది మాత్రమే జీవించి యుండేవారట.

♦ ♦ ♦

ఇంతకాలమునుండి నిర్బంధ విద్యావిధానము నమలుపరచినా యింకా నిరక్షరాస్యులున్నారట ఇంగ్లాండుదేశంలో.



# మామిడి



మనరాష్ట్రములో మామిడిరకాలు 300 లకు పైగానున్నవని వ్యవసాయ శాఖవారు తెలిపియున్నారు. ఋతువులననుసరించి, రుచులననుసరించి, సారక జీవులయిన పెక్కండ్రు వారల పేరుతోను, మక్కువచే మధురతరములయిన మామిడిపండ్లకు ముద్దుపేర్లు పెట్టుకొనుట మనము యెరిగినవిషయమే. జాతి, రకము, సొంపు, వర్ణముల ననుసరించి నామధేయముల నిడుటలోకూడా కొంత నేర్పరితనముండవలయును. వజ్ర వైడూర్యములవలె మామిడిరకముల నాణ్యములు మనుష్యులను తారుమారుచేయును. మూడుపందల రకములలో అనుదినాచరణలోను, అందుబాటులోనున్న రకములను యిందు పొందుపరచెదను.

1. జహంగీరు, 2. ఇమాంపసంద్ 3. అలంపూరు. 4. రాజాదర్భాంగ, 5. ఉదయకుంకుమ 6. నవాబ్ మామిడి. 7. బనేషన్ 8. మల్గోవా. 9. రుమాని, 10. నీలం 11. సువర్ణరేఖ, 12. నెమలికంఠం. 13. పంచదారకలశం. 14. చెరుకురసం. 15. కొత్తపల్లికొబ్బరి. 16. అమృతరసం 17. బంగినపల్లి 18. నూజవీడు 19. గులాభి 20. కదిరి. 21. కడియంమామిడి 22. పాణెం రకములు. 23. పీతరుఫసందు. 24. కలక్టరుఫసంద్. 25. పంచరత్నం. 26. పెద్దరసం, చిన్నరసము. ఈపేర్లతో పిలువబడు పెక్కురకములు కలవు.

వీటినన్నిటిని జాగ్రత్తగా పరిశీలిస్తే దాదాపుగ మంచిరకము లన్నిటికి కాపుతక్కువ. ఒకవేళ కాచినను రుచిగలపండ్లనివ్వవు. వృక్ష శాస్త్రపరిశోధకులు పూర్వంవలె ఎరువులుమార్చి స్థలములు మార్చి మామిడితోపులలో ఋతువున నాగళ్ళతోదున్ని చూచిరిగాని తగినంతలాభము కానుపించినది కాదు. మామిడిపండ్లను మాత్రము అన్నిఋతువులయందు కొన్నిప్రాంతములందు లభించుటకు చేసిన కృషిమాత్రము ఫలించినది. ఇంకను యీ మామిడి జాతిని ఉత్తమమయిన పండ్లను కాయించుటకు అనుభవనీయమయిన కృషియెంతయో చేసిచూచిరి. చివరకు అంటు Crafting పద్ధతిని అవలంభించి రెండురకాలు చెట్లనుకలిపి మూడవరకాన్ని సృష్టించటం ఉత్తమరకాన్ని సాధించుటకు మార్గమని వృక్షశాస్త్రవేత్తలు నిర్ణయించిరి. శాస్త్రవేత్తలు నిర్ణయించిన విధానములకంటే, కడియం, కొడూరు, చిత్తూరు, బనగానిపల్లె పాణెం మొదలగు మామిడితోటలలో పనిచేయు కూలివాండ్రుయెంతో నేర్పుతోకట్టి వివిధదేశములకు అంట్లనుపంపి ఆస్తులను సంపాదించిరి.

తోటలలో యీ విధముగ తయారుకాబడిన అంటుమామిడి రకములకంటె, ఇండ్లపెరడులలో పెంచిన మంచిజాతి పండ్లు కాయును. ఇండ్లఆవరణములలో వేసుకొన్న మామిడిచెట్లు గున్నలవలె చూచుటకు అందముగను, అతిథులువచ్చినప్పుడు వానినీడన కులాసాగా కబుర్లు చెప్పుకొని కాలక్షేపము చేయుటకును, వనవిహార సల్లాపములకు ఉల్లాసముగా నుండును.

మనము నిత్యము భుజించు ఆహారముకంటే మామిడిపండ్లు, టెంకలోని పప్పు యేవిధముగ కూడ శరీరమునకు బలమొసంగుటలో తీసిపోనేరదు.

నేటికిని మనము గమనించవలసిన విషయము వకటి మాత్రముయున్నది. Vitamin అనుపదము సామాన్యమయిన గృహిణులకున్ను, విద్యావతులకున్ను, మామూలైనది. శరీర పోషణకు, అందముకూ బలముకు విటమిన్ చాల ముఖ్యము. ఇందులో మరియొక గొప్పతనము కలదు. ఋతువుల నాశ్రయించి రుగ్మతలు, రోగములు, వ్యాధులు ప్రజలకు అంకురించుచుండును. మామిడి పండ్లకు, మల్లెపూలకూ మధుమాసమే శ్రేష్టము. ఈ ఋతువున వ్యాధులు వచ్చుటకు తగినంత సావకాశము ప్రకృతి మాత కల్పించి యుండలేదు. మధుమాసమున రవి చవి చూడని శరీరభాగముండదు. అందులకు తగిన శరీర దారుఢ్య ధారణకు అనువగు ధాతుసంచయము రవియే ప్రసాదించుచున్నాడు.

అయితే మనము సంచరించునది భూమిమీద. మహావృక్షములు, దివ్య ఓషధులు లభించునదియు భూమిమీదనే. పంచ భూతముల ననుసరించియే శరీరము, అందులో జీవధాతువు యిమిడి యుండుట్లు. ఇట్టి జీవమును పోషించుటకు, వర్ధిల్లజేయుటకు తగిన ధాతువు లన్నియు మామిడిపండు యందు, టెంకలోని పప్పుయందు నిమిడి యున్నవి. మామిడి ఇగుళ్ళు, లేత ఆకులు, లేత మామిడి ఆకులరంగు రమణీయముగా నుండును. సూర్యరశ్మి మామిడి చిగుళ్ళపైన పడిన మిసమిసలాడుచుండును. జిగురుగా నుండును. కోకిలకు మిక్కిలి మక్కువైన ఆహారము. ఆకును వ్రేళ్లతో నలిపిన పెళపెళ మనును. కోవిల తనివి తీర మామిడిచిగుళ్ళను మేసి మృధుమధురముగ కూయును. ఆ కూతయే వసంతుని ఆగమన సమయము. కళాకోవిదులు, కవులు, వాడ వాడల సంచరించు గొల్లపిల్లవాండ్లు పిలువని పేరంటమునకు బోయినట్లు కోవిల కూతల అనుకరించెదరు. కోకిలకే కాదు మామిడి చిగుళ్ళు మానవుల కందరకు ఉపయోగము. వైద్యానుభవములో నొకముఖ్యమయినది.

మాటలు సకాలమునకు రానిపిల్లలకు మామిడి చిగుళ్లు లేతవి ఉదయమున నమిలించినను, ఆహారమిడుసందర్భములలో చేర్చియిచ్చినను మాటలువచ్చును. నాలుకకు మంచి అభిరుచి అయిన పూత Coating నిచ్చును. నాలుక కదలును. మాటధ్వనించును. నత్తిమాయమగును.

గుండెలలోమంట, నీరసము, నిస్సత్తువ, ధాతుక్షీణత, రక్తములో మధురయుతమగు శక్తులు లోపించుట, ఆకలి మందగించు సమయములలో మంచి రకపు మామిడిపండు రసమును రోజునకొకసారి షర్బతు మాదిరిగ యిచ్చిన శాంతించును; హాయినిచ్చును; నిద్రతెచ్చును. పరిమాణము దాహమునకు చాలినంత రసము చాలును.

వేశవిలో కారణము లేకనే కొన్నివేళల వాంతులు, నీళ్ళవిరేచనములు, కడుపునొప్పితోకూడిన విరేచనములు అగుచుండును. అట్టివానికి మామిడిటెంకె (ముట్టె) లోని పప్పును, మెత్తగా చూర్ణము చేయవలయును. వస్త్రకాళితముచేసి మంచి సీసాలో భద్రముచేసుకొని వుంచుకొనవలయును. రోజుకు రెండు పర్యాయములు తడవకు 5 గురుగింజల ప్రమాణము చొప్పున నోటిలో వేసుకొని గోరువెచ్చని నీరు త్రాగవలయును.

చాలామంది మామిడికాయలు, పండ్లతో పచ్చళ్లు ఊరగాయలు పెట్టుపనులు ముగియగానే వీధులలో టెంకెలను వృధాగా పారపోయుదురు. జాగ్రత్తచేసి వుంచుకొన్న ఔషధరీత్యావారు ఉపయోగించుకొని, తదితరులకు వైద్యసహాయము పల్లెగ్రామములలో చేయవచ్చును.

కె. వి. రంగయ్యశాస్త్రి.

---

# గాయక సార్వభౌముని అస్తమయం

గాయక సార్వభౌమ పారుపల్లి రామకృష్ణయ్యగారు సుప్రసిద్ధ ఆంధ్రగాయకులు, విద్వాంసులు కూడాను. వారు జంత్రగాత్రములందు సమానమైన ప్రతిభా సంపత్తులుగలవారు. ఆకస్మికంగా జూలై 7-వ తేదిన హృద్రోగమువలన మరణించారు. చనిపోవునాటికి 68 సం||ల వయస్సు.

ఈ సందర్భములో వారి శిష్యకోటి సంతాపమునకు మేరలేదు. ఆంధ్రగానకళాభ్యున్నతికి తీరని లోటనికూడ చెప్పక తప్పదు.

ఆంధ్రులు, అన్యరాష్ట్రీయుల ఆదరాభిమానములకు పాత్రులైనారు శ్రీ రామకృష్ణయ్యగారు. అనేక సంగీత పరిషత్సమావేశములకు అధ్యక్షత వహించారు. వారి గానకళానైపుణ్యమునకు చిహ్నముగా అనేక బంగారుపతకములను పొంది గౌరవ మర్యాదలకు పాత్రులయిరి. 1931 సం||లో జగ్గయపేటలో జరిగిన తృతీయాంధ్ర సంగీత పరిషత్సభలో "గాయకసార్వభౌమ" బిరుదముతో సన్మానించబడిరి.

ఆంధ్రదేశములో కర్ణాటక సంగీతమునందభిరుచిని వృద్ధిపరచిన వారిలో వీరొకరు. వారు లేని లోటును వారి శిష్యులు తమ పరిశ్రమవలన తీర్చగలరని ఆశిస్తున్నాము.



భారత సైన్యాధిపతి జూన్ 19వ తేదిన హైదరాబాదునందు రోటరీక్లబ్‌లో నుపన్యసించుచు నిట్లనెను:

సైన్యములో పనిచేసేవారికి ఏదో తీవ్రమైన రక్తదాహముంటుందని ప్రజలు దురభిప్రాయ పడుతున్నారు. కాని యుద్ధాలను సంభవింపజేసేది కౌటిల్యమెరిగిన రాజకీయ వేత్తలే కాని సైనికోద్యోగులు ఎంతమాత్రము కారు.

జూన్ నెల 17వ తేదిన అమెరికాదేశపు ప్రెసిడెంటు ట్రూమన్ అబ్రహామ్‌లీగు సమావేశమునకు పంపిన సందేశములో యిట్లు ఉద్ఘాటించిరి:

క్షమ, పట్టుదల, భగవంతుని దయలతో అమెరికా శాంతిని రక్షించడమే గాక స్వతంత్ర మార్గానుగామియై తన జీవితమార్గానుగామియై తనజీవితమార్గాన్ని గూడ నిలుపుకోగలదు.

వినయాశ్రమమునుండి శ్రీ స్వామీ సీతారాంగారి నాయకత్వమున బయలుదేరిన ఆంధ్రానంద యాత్రలో రాంభోట్లు పాలెంలో యిట్లుపన్యసించిరి:

"ఆంధ్రరాష్ట్ర స్థాపనకృషిలో అసువులబాసినవారి కందరకూ స్మారక చిహ్నంగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడి తీరవలెను. కేంద్ర, రాష్ట్రప్రభుత్వములు రాష్ట్రం కావలెనను ధర్మబద్ధ సహజవాంఛను మన్నించి గాంధీజీ జన్మదినమైన అక్టోబరు 2వ తేదిలోగానే ఆంధ్రరాష్ట్రమును స్థాపింపజేయవలెను.

శ్రీ పురుషోత్తమదాస్ టాండన్ అలహాబాదుజిల్లా కాంగ్రెసు సంఘ సమావేశములో ఉపన్యసించుచు నిట్లనిరి:

కంట్రోళ్లు అవినీతికి, లంచగొండితనానికి కారణభూతమైనప్పటికీ సముద్దేశ్యంతోనే పరిమితంగానున్న ధాన్యాన్ని అందరికి న్యాయంగా పంచేయుద్దేశ్యముతోనే ప్రభుత్వమువారు వాటిని అమలు పరచారు.

ఆచార్య కృపలాని లక్నోలో నొక బహిరంగ సభలో నిట్లుపన్యసించిరి:

స్వతంత్ర భారతంలో ప్రజలకు రోజుకు ఒక్క పూటైనా కడుపార తిండి లేకపోవడం మనకూ, దేశానికి సిగ్గుచేటు. నేడు పదవులలోనున్న పెద్దలలో రానురాను ప్రజలతో సంబంధాలని తెంచేసుకొని తమ యిష్టానుసారం ప్రవర్తిస్తున్నారు. ప్రజలసమస్యలను పరిష్కరించ లేనివారు తమ అధికారపదవుల నుండి విరమించుట మంచిది. దేశానికికూడ క్షేమం.

హైదరాబాదులో రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ ఉపన్యసించుచు యిట్లనిరి:

మద్యాన్ని ఒకపానీయంగా వాడటం అన్నిదేశాలలోని అన్నివర్గాల స్త్రీ పురుషులయొక్క ఆరోగ్యానికే కాక పనిపాటలు పాడవటానికికూడ ప్రమాదకరమైన చెరుపు కలిగిస్తుంది. కాబట్టి యీ యలవాటు పోగొట్టడం విచక్షణా జ్ఞానం గల ప్రతివానికి విధియైయున్నది.




మ్రొక్కుబడి: మొక్కపాటి నరసింహశాస్త్రిగారు. మొక్కపాటివారు, అడ్మిరాలిటీ హౌస్, మైలాపూరు, మద్రాసు 4. వెల రు 2-0-0.

శ్రీ మొక్కపాటివారి రచనలు ఆంధ్రదేశానికి చిరపరిచితాలు. ఆధునిక హాస్యరచయితలలో శ్రీ శాస్త్రిగారు సుప్రసిద్ధులు. ఇది వారప్పుడప్పుడు వ్రాసి ప్రచురించిన నాటకాల సంపుటం. ఇందు మ్రొక్కుబడి, అభ్యుదయం, పెద్దమామయ్య, అసాధారణ సమావేశం, వారసత్వం, పాతివ్రత్యం అనేవి పొందుపరుపబడినవి. సంఘంలో ఉన్న నైజాలు, వైపరీత్యాలు వీనిలో చక్కగా రూపింపబడినవి. మ్రొక్కుబడిలో సామాన్యంగా స్త్రీలకు హృదయంలో హత్తుకొన్న మ్రొక్కుబళ్లమీద విశ్వాసం, ఆధునిక యువకులలో వానిపై మొలకెత్తిన అవిశ్వాసం - ఈ రెంటికి సంఘర్షణ వర్ణింపబడినది. ఆధునికులు అక్కడక్కడా ఈ విషయంలో ప్రదర్శించే "ఆడంబరం, డంబం, దర్పం, పరీక్షాసమయాలలో నిలవడం కష్టం" అనేది నిరూపించడానికి ప్రయత్నించారు; నిలవదనే చూపారు. అయితే నిజంగా సంఘంలో ఈ విషయంలో ఉన్న సంఘర్షణను పాఠకుల ముందుంచిన శాస్త్రిగారు సమస్య సమస్యగానే ఉంచి పాఠకులకే పరిష్కార బాధ్యత వదిలితే నాటకం ఇంకా రసవత్తరమయ్యేదేమో అని నా అభిప్రాయం. మంగమ్మ విశ్వాసం మ్రొక్కుబడి చెల్లితే తన కూతురు బ్రతుకుతుందని, అల్లుడు శేఖర్ రోగానికి చికిత్స చేయించాలిగాని కొండమీద దేవునికి మ్రొక్కుబడి యేమిటని ఇద్దరు తమతమ విశ్వాసములను ఈలగరుచు రోగా రాజ్యాన్ని స్వర్గస్థురాలినిచేసి ఉన్నట్లైతే - సంఘానికి యోచనచేయడానికి అవకాశం కలుగుతుంది. అట్లుగాక తుదకు శేఖరం మెత్తబడడం రాజ్యం బ్రతకడంవల్ల మంగమ్మ విశ్వాసం సంఘంలో ఇంకా పీఠం వేసుకు కూర్చుంటున్న దనడానికి సంశయమేమున్నది? శాస్త్రమర్మములు నిరంతరము ప్రకటమవుతున్నప్పుడు సాంఘికులకు మూఢాచారాలయందు విశ్వాసము సడలి శాస్త్రమునందు విశ్వాసము ప్రబలితేనే గాని సంఘానికి శ్రేయస్సు లేదు. శ్రీ శాస్త్రిగారి కలంకూడా ఏడుకొండలవాడికి శిరసు వంచిందనడానికి మాకు ధైర్యం చాలదు. ఆధునికుల వివేచనాపరులకు శాస్త్రము ప్రజాభ్యుదయకారి అయినంతవరకు సమ్మతమే. కాని దాని నాశ్రయించిన శాస్త్రజ్ఞులు స్వార్థపరులై, అధికార దుర్గ్రహులకు గుడిసి ఆటంబాంబులు వంటి మారణ సాధనాలను కనిపెట్టి అందిస్తున్నప్పుడు వారు స్థిమితముగా ఉండజాలరు. ఈ కారణంచేత శ్రీ శాస్త్రిగారి హృదయంలో రేగిన తుపానే ఈ నాటకరూపు దాల్చిందనాలి. వారన్నట్లు అంతకు ముందెన్నడో చదివి మరచిపోయిన "Progress" అనే ఆంగ్ల నాటిక ప్రోత్సాహముగా ఉపకరించి యుండవచ్చుగాని దీనికి జనకులు వీరే అనాలి.

'పెద్దమామయ్య' సంఘంలో స్థిరమైనవ్యక్తి, ఇతడిని చక్కగా రూపించారు.

'అసాధారణ సమావేశం' - ఇదిన్ని అద్భుతమైన సన్నివేశం. ఏదో గొప్పపని చేతామనే 'నారాయణరావు,' ఏం కావాలో, ఏమవుతున్నదో, ఏమవుతుందో తెలీక వీరావేశంతో వళ్లు తెలియని శివమాడే కర్మవీరుడు. అన్నిటికి పెద్దరికానికి తయారై క్రియాశూన్యుడైన సభాపతి ఇత్యాదులు నిత్యము మన మధ్యనే తిరుగుతూ ఉంటారు; కాని వీరిని మనము గమనించము; గ్రహించము; అంచేత శ్రీ శాస్త్రిగారు వీరిని పాత్రలుగా తీసుకొని నాటకం వ్రాసి ఆడించి - సంఘాన్ని యోచించుకోమన్నారు. ఇటీవల

ఒక గ్రామంలో కర్మవీరుడు 'బ్లాకుమార్కెట్టు' ధ్వంసం కావాలని వీరావేశంతో తనకు తోచినట్లుపనిచేసి అడ్డంకులు రాగా విహ్వలహృదయుడై గంగవెర్రులెత్తి, సంచరించడం ఈ సమర్థుడు స్వయంగా చూచాడు. 'బ్లాకుమార్కెట్టు' నిర్మూలనం చేయవలసిందే, సాధ్యాసాధ్యాలు, ఆటంకాలు నేర్పుతో ఓర్పుతో గమనించి నిమితంతో మెలకువగా కార్యసాధనకై కృషిచేయగల ధృతి, శాస్త్రజ్ఞానము మన యువకులలో తక్కువ. అట్టి యువకులతో ఆంధ్రదేశం నిండి తొణికిసలాడుతున్నది. ఈ నాటిక అట్టివారికన్ను తెరుస్తున్నది.

వారసత్వం: మానవనైజంలో అతి సున్నితమైన ప్రకృతిని కడుచాకచక్యంగా ఇందు పొందుపరచారు శ్రీ శాస్త్రిగారు. ఆస్తిమంతుడైన భార్య పినతండ్రి రమణారావు అంతో యింతో ఇప్పుడే యేల తమకు ముట్టచెప్పడని దేవులాడుతూ హంగామా చేసిన వెంకట్రావు, ఆయన ఆస్తినంతా పోగొట్టుకొని నిరాధారుడై తన పంచనచేరగానే - "ఆస్తిపోతే యేంజేస్తాము. నేను ముట్టకువద్దంటానా. అంత అవివేకినా?" అని ఆదరించి - అనుమానించిన భార్యను "ఇంతే నన్ను అర్థం చేసుకున్నది" అని మందలించడం నిజంగా ఆశ్చర్యకరం. భౌతికవాదము చెలరేగిన ఈ కాలంములో యువకుల మనస్సులలో ఉత్తమశీలం రేకెత్తించేది ఈ నాటిక.

పాతివ్రత్యం: స్త్రీ నైజమైన ఈర్ష్య లేక మానం చిత్రింపబడ్డది. అయితే ఆ స్త్రీ నవనాగరిక నారీమణియైతే ప్రళయస్వరూపం వేరువిధంగా ఉండేది. ఆమె మహాపతివ్రత. అందుచేత ఆ మానం ముడిపడార్థంగా తయారైంది. నేటి దంపతులు కొందరిలో ఉండే తారతమ్యం కారణంగా పురుషుడు అన్యకాంతా పరిచయంతో కొంత సల్లాపంగా గడపడం ఆశ్చర్యకరమైంది కాదని శాస్త్రిగారి అభిప్రాయము. వాస్తవమూనూ. "కాని, పతి పరకాంతలతో కాలక్షేపం - సత్కాలక్షేపమే అనుకోండి - చేస్తున్నాడంటే ఎంత పతివ్రత అయినా బాధపడకుండా యేలా ఉంటుందీ!" అని మొక్కపాటి ప్రశ్నిస్తున్నారు తమ పీఠికలో. ఈ నైజపరిస్థితులను చక్కగా సమీక్షించారు శ్రీ శాస్త్రిగారు. అధునికులు తమ అర్ధాంగులు కేవలం పతివ్రతలు మాత్రమే కాకుండా భర్తనర్థం చేసుకొని, ఆయన మనస్సు నుల్లాసపరిచే, "దయాదాక్షిణ్యం, హృదయం, మానవత్వం" అలవరచుకోవాలని శ్రీ శాస్త్రిగారు గృహలక్ష్ములను కోరుచున్నారు. కావుననే రమణారావు చేత "అంత పతివ్రతవు కాకుండావుంటే కాస్త బాగుండునేమోనని అప్పుడప్పుడనుకుంటూ ఉండే మాట వాస్తవమే!" అనిపిస్తారు శాస్త్రిగారు. ఇల్లాండ్రు ఈ నాటికను చదివి, చూచి నెమరువేసి హృదయస్థం చేసుకోదగును అనిపిస్తుంది.

ప్రాచ్య పాశ్చాత్య విద్యా పరిచయముగల శ్రీ శాస్త్రిగారు సంఘానికి పనికివచ్చే, ఇహలోక సంబంధమైన సమస్యలతో ఇట్టినాటకాల నింకా వ్రాయాలని కోరుతున్నాను.

రామచంద్రుని వెంకటప్పం

హోమియో ఔషధముల బాహ్యోపయోగములు: ప్రచురణకర్తలు శ్రీ మురళీ హోమియోస్టోర్సు, రాజమహేంద్రవరం. వెల అణాలు 4.

అనుభవపూర్వకమైన హోమియో వైద్యచికిత్సావిధానమునకు వ్యయముతక్కువ ఫలమధికము. ఈ ఔషధములు గుణమిచ్చుటకు నమ్మకము, ఓర్పు చాల అవసరము.

ఈ చిన్న పుస్తకమునందు హోమియో ఔషధముల బాహ్యోపయోగములు వివరించబడినవి. అనగా మందు పైపూతవలన స్వస్థయగు వ్యాధులకు చికిత్సా విధానము కలదు.

తేలుకాటు - హోమియో చికిత్స! ప్రకాశకులు శ్రీ మురళీ హోమియోస్టోర్సు, రాజమహేంద్రవరం. వెల అణాలు నాలుగు.

తేలుకాటు బాధ సహజం. కాని దానికి చికిత్స సమయానికి, ప్రాంతానికి తగినట్లు చేస్తుంటారు. ఈ తేలుకాటుకు హోమియో చికిత్స అమోఘంగా పనిచేస్తుంది. అదే యీ చిన్న పుస్తకంలో వివరించబడింది.

సి. సి. పున్నయ్య

# సంపాదకీయములు

## రేషను పెంపకం

జూన్ నెల 24 వ తేదినుంచి 12 ఔన్సులకు రేషను ప్రమాణం పెంచుటకు ప్రభుత్వమువారు ఉత్తరువులు జారీచేశారు. ఈ ఉత్తరువులు పైకిమాత్రం ఆకర్షణవంతంగా నున్నవి.

బియ్యం యధాప్రకారం 8 ఔన్సులేనట. మిగిలిన నాలుగు ఔన్సులు గోధుమలు, జొన్నలుయిస్తారట. ఆ యధికంగా యిస్తున్న జొన్నలు, గోధుమలు సప్లయిలు అందుబాటులో నుంటేనే యిస్తారట.

మన ప్రాంత్యములలో బియ్యం వాడుక అమలులోనున్నది. ఇంతకాలం బియ్యం యిచ్చేవి చాలడంలేదనే రేషను పద్ధతిమీద అసంతృప్తి. సాధారణంగా 8, 9 ఔన్సులు రేషను యిచ్చే రోజులలో యిచ్చే గోధుమలను, జొన్నలను వినియోగించుకొనుటకే ప్రజలు అసంతృప్తిని వెల్లడిస్తుండేవారు. ఇప్పుడవి అధికంగా యిస్తేమాత్రం తృప్తిచెందుతారా?

ఈపరిస్థితుల దృష్ట్యా కనీసం 1 ఔన్సు బియ్యపు రేషను ప్రమాణమునైనా పెంచ ఏర్పాటు చేయుట వాంఛనీయము.

## క్షయవ్యాధి

వ్యాధి భయంకరమయింది. దినదిన ప్రవర్ధమానమగుచున్నది. కాని నివారణకు తగినన్ని వైద్యాలయములులేవు. ఉన్నవా చాల తక్కువ. ఆ వ్యాధితోనే నలుగుర్లో నివసిస్తూయుంటే అంటువ్యాధి కాబట్టి అధికంగా వ్యాపిస్తున్నది.

వైద్యసహాయాన్ని ఎక్కువ చేయడానికి, వైద్యాలయములను నిర్మించడానికి ధనం కావాలి. ప్రభుత్వ సహాయం మాత్రము, చాలడంలేదు. కాబట్టి ప్రజా సముదాయమునుండి ధనం సేకరించాలి. ప్రజలు కూడ ఉదార హృదయంతో శక్తికొలది సహాయం చేయాలి; ప్రజలలో వ్యాధి వ్యాపించకుండా తగు జాగ్రత వహించాలి. వ్యాధిగ్రస్తుల తమ మధ్య నుండనివ్వరాదు.

ఇంతమాత్రముచేత వ్యాధి వ్యాపించడం తగ్గుతుందనుకోడం పొరబాటు. ఈవ్యాధికిగల ప్రముఖ కారణములలో మంచి ఆహారపు కొరత, పరిశుభ్రమైన వసతి సౌకర్యములలేమి ఎన్నతగినవి.

ఇవి సమకూరిననాడే వ్యాధి ఉధృతం తగ్గేది. వీనిని దృష్టిలో నుంచుకోకుండా ఎన్ని ప్రణాళికలు తయారుచేసినను లాభముండదు.

## మహిళా సమాజములు

మహిళా సమాజములు విరివిగా ఏర్పడుచుండుట సంతోషింపతగిన విషయం. కాని కార్యకలాపములు చెప్పుకోతగినంత తృప్తికరముగా యున్నవనే అసంతోషము.

మామూలుగ ఈ సమాజములందలి సభ్యత్వమును చూచినచో అధికంగా విద్యాధికులు, ధనవంతులే కనుపిస్తుంటారు. వాని కార్యకలాపములుకూడ చాలభాగము విద్యాధికులకు, సంపన్నులకు అందుబాటులో నుంటున్నవి. కాని విద్యాగంధంలేని అనేకమంది నారీమణుల నిస్సహాయత వాని దృష్టిలోకి రావడంలేదు. ఇక ఆర్థికంగా వెనుకబడియున్నవారని కలలోకూడ తలచేవి లేవేమో!

ఈపరిస్థితులలో నిరక్షరాస్యులై, విజ్ఞాన వికాసములకు దూరముగానున్న నారీలోకానికి విద్య గరపుట మహిళాసమాజములు ప్రత్యేక కృషియైయుండవలెను.

## శ్రీ ఖరనామ సం॥ర ఆషాఢ, శ్రావణమాసములు.

| | | | |
|---|---|---|---|
| | 16 | సో | ద్వా 8.36 జ్యే 36-14 తైవ 3-34 వాసుదేవద్వాదశి |
| | 17 | మం | త్ర 2.6 ఏష్యా 53-20 మూ 41-44 ది 28-2 |
| | 18 | బు | ○ పూ 49-3 పూషా. 27-12 గా 13-32 వ్యాసపూజ |
| | 19 | గు | బ. పాడ్యమి 42-50 ఉషా. 22-56 రా 0-4 |
| | 20 | శు | వి 36-26 శ 19-8 దివి 28-40 రవిం 19-40 |
| జూలై నెల | 21 | శ | త 32-52 ధ 16-27 వ 5-9 సంకష్టహరచతుర్థీవ్రతం |
| | 22 | ఆ | చ 29-5 శత 14-5 ది 29-51 |
| | 23 | సో | పం 26-36 పూభా 17-11 రా 5-9 భాతృపంచమి, సింహాయనం |
| | 24 | మం | ష 25-12 ఉభా 17-30, రా 12-7 |
| | 25 | బు | స 25-15 రే 15-1 త్యాజ్యాభావః మృత్యుయోగం, |
| | 26 | గు | అ 26-24 అశ్వ 17-46 ది 0-19 |
| | 27 | శు | న 28-40 భర 21-34 రా 21-49 |
| | 28 | శ | ద 31-52 కృ 26 17 త్యాజ్యాభావః |
| | 29 | ఆ | ఏ 35-38 రో 31-36 ది 9-49 |
| | 30 | సో | ద్వా 39-55 మృగ 37-27 త్యాజ్యాభావః |
| 1951 సం॥ | 31 | మం | త్ర 44-21 ఆ 43-16 ది 0-29 |
| | 1 | బు | చతు 48-41 పున 49-18 దివి 16-17 మాసశివరాత్రి |
| | 2 | గు | ● అమా 42-39 పుష్య 54.45 ది 10.7 జ్యోతిర్భీమేశ్వరవ్రతం |
| | | | **శ్రావణ మాసము** |
| | 3 | శు | శు. పాడ్యమి 56-0 ఆశ్రే 59-46 దివి 29-25 |
| | 4 | శ | వి 58-0 మఘ 60-10 దివి 31-50 చంద్రోదయం |
| | 5 | ఆ | త 59-52 మఘ 3-57 ది 24-53 మధుస్రవావ్రతం |
| | 6 | సో | చ 60-10 మఘ 6-54 ది 25-27 నాగచతుర్థి |
| ఆగస్టు నెల | 7 | మం | చ 0-28 ఏష్యా ఉ.ఫ దివి 29-59 నాగపంచమి |
| | 8 | బు | ష 56.58 హ 9-24 దివి 29-17 |
| | 9 | గు | స 52-52 చి 8-50 దివి 22-26 |
| | 10 | శు | అ 49-6 స్వా 7-9 దివి 20-31 వరలక్ష్మీవ్రతం |
| | 11 | శ | న 43-51 విశా 4-25 దివి 17-49 శ్రీ వెంకటేశ్వరవ్రతం |
| | 12 | ఆ | ద 38-0 అనూ 0-51 జ్యే 55-41 దివి 13-50 |
| | 13 | సో | ఏ 31-39 మూ 52-7 ది 15-2 |
| | 14 | మం | ద్వా 25-4 పూషా 47-20 దివి 14-13 తిథిద్వయం, మంగళగౌరీవ్రతం |
| | 15 | బు | త్ర 18-37 ఉషా 47-20 దివి 6-0 చతుర్దశితిథిః. |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd
15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.

